# అభ్యుదయ

సచిత్ర సాహిత్య మాసపత్రిక


| సంపుటి 2 | 1948 ఆగస్టు | సంచిక 8 |
|---|---|---|



సంపాదకులు:

కొమర్రాజు వినాయకరావు

ప్రయాగ కోదండరామశాస్త్రి

అనిశెట్టి సుబ్బారావు





గౌరవ సంపాదకులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ — పి. వి. రాజమన్నారు

దేవులపల్లి కృష్ణశాస్త్రి — తుమ్మల వెంకటరామయ్య

కొడవటిగంటి కుటుంబరావు


★ స్వాతంత్ర్యదినోత్సవ ప్రత్యేకసంచిక ★

వెల ఆరణాలు

# ★ ఇందులో ★

సంపుటి 2 అభ్యుదయ ఆగస్టు
సంచిక 8 1948

ఆంధ్రాభ్యుదయ రచయితల మాసపత్రిక

# స్వాతంత్ర్య దినోత్సవం

స్వాతంత్ర్య దిన ప్రథమ వార్షికోత్సవం సమీపిస్తున్నది. గత సంవత్సరం భారత పౌరులంతా స్వాతంత్ర్య దినోత్సవాన్ని ఒక మహోజ్వల సంఘటనగా ఎంచి ఉత్సవాలు, ఊరేగింపులు జరిపి, తమ ఆనందాన్ని, ఆశలను ప్రదర్శించారు. దాస్యాంధ చరిత్ర గడిచిందనే ఆనందమూ, భావి భారత దేశం స్వతంత్ర సమ సమాజ ప్రతిష్ఠకై కృషి చేస్తుందనే ఆశ ప్రతి పౌరుని హృదయంలోనూ వెలిగాయి.



సంవత్సరం గడిచింది. ఈ సంవత్సరంలో పంజాబు రాష్ట్రం మానవరక్తంలో స్నానమాడింది. అటునుంచి ఇటు, ఇటునుంచి అటు, నిర్భాగ్యులైన లక్షలకొలది హిందూ, ముస్లిం ప్రజలు బ్రతుకు తెరువు వెతుక్కుంటూ ప్రయాణం చేశారు. ఇల్లు వాకిలీ లేని జీవనోపాధి లేని ఈ అమాయకులు తిండికోసం, బట్టకోసం తల్లడిల్లిపోతున్నారు.

ఒకప్పుడు డబ్బుకోసం కాశ్మీర్ ప్రజలను ఒక అనామక మహాశయునికి తెగనమ్మిన సామ్రాజ్యవాదులు నేడు తిరిగి పాకిస్థాన్‌ను పురికొల్పి కాశ్మీర్ నందనవనంలో చిచ్చు పెట్టారు. చదువు సంధ్య లెరుగని కాశ్మీర్ ప్రజలు ఈ ద్రోహుల దాడి నెదుర్కోవడానికి తమ సర్వశక్తులూ ధారపోస్తున్నారు.

సంస్థానాలలో మహారాజులంతా; కొత్తగా స్థాపించిన భారత ప్రభుత్వం గొడుగుకింద చేరి యూనియన్లుగా ఏర్పడి, తమ పురాతన దోపిడీ విధానాన్ని స్వేచ్ఛగా కొనసాగిస్తున్నారు.

ఇటు, హైద్రాబాదు సంస్థానం ఫాసిస్టు ప్రభుత్వంకింద ఖైదుగా మారిపోతే అక్కడి గ్రామీణ రైతులు ఈ నిరంకుశ పీఠాన్ని పునాదులతో పెకలించేందుకు సాయుధ విప్లవం సాగిస్తున్నారు.

ఆనాడు భారతదేశమంతటా ఆశలతో, ఆశయాలతో ఉత్తూగిన కోట్లకోలది రైతు, కూలీలు మళ్లీ ఆగస్టు 15 స్మృతికి రాగా నేగతిసంవత్సరపు తమజీవితాలను, ఆనాటి తమ దివ్య స్వప్నాలతో సరిపోల్చుకుని చూసి నివ్వెరపోతున్నారు. అప్పటి ఆశలెక్కడ ! ఇప్పటి జీవితమెక్కడ ! పూర్వంలాగే ఇప్పుడూ నిరుద్యోగమూ, నిరక్షరాస్యత దరిద్రమూ, దురభిమానము నట్టింట కాపురముంటున్నాయి. సామాన్య పౌరుడు తిండికి, గుడ్డకూ నోచుకోక "పరుల ఇంటి అరుగులపై" పడిగాపులు కాస్తున్నాడు. కూలీకి తిండిలేదు, రైతుకు భూమిలేదు. విద్యావంతులైన యువకులకు ఆశకంటె ఆత్మహత్యే చేరువుగా కన్పిస్తున్నది. పిల్లలు, వృద్ధులు, విద్యా, వైద్య సౌకర్యాలులేక నానాటికి కృంగిపోతున్నారు.

ఊరివెలుపల వుండే శ్మశానం ఊరిలోకి చొచ్చుకువస్తున్నది. ఈస్థితిలో భాగ్యవంతులకు, పరిస్థితులకు బానిసయైనపౌరుడు అలజడి చెందటంలోఆందోళన చెయ్యటంలో ఆశ్చర్యమేముంది !

ఒకవంక పురాతన రాజ్యఛత్రాల కారునీడల్లో కనలే లక్షలాది ప్రజలు ! మరొకవంక యుద్ధకాలపు ఆస్తులకు సంక్రమించిన అధికార పదఘట్టనకింద నలిగే కోట్లకొలది ప్రజలు ! ఎక్కడచూసినా ఇదే దుర్భరానుభవాన్ని పొందుతున్న ప్రజాబాహుళ్యమంతా ఒకే ఆశయంతో ఐక్యమై ఒకమహత్తరప్రజావుద్యమాన్ని నిర్మిస్తున్నారు. తాము స్థాపించదలిచిన సమధర్మ సమాజాన్ని అడ్డుకునేవారిని ఎదిరిస్తున్నారు.

ప్రజా ఉద్యమ ప్రాబల్యాన్ని సహించలేని మహారాజులు, జమీందారులు, కొత్తగా అధికారం హస్తగతం చేసుకున్న వ్యాపారులూ దేశాన్ని సంక్షుభితం చెయ్యటానికీ, అశాంతినీ, అరాజకాన్నీ వ్యాపించి తమ దోపిడిని స్వేచ్ఛగా కొనసాగించటానికి కుట్రపన్ని ప్రజల వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాలను అణగద్రొక్కుతున్నారు. శాంతికోసం అహోరాత్రులు వేదనపడిన గాంధీమహాత్ముడుసైతం ఈ కుట్రకు బలియైనాడు.

ప్రజాహృదయం ఉద్వేగంతో స్పందించే ప్రతిప్రాంతంలోనూ మళ్ళీ నిర్బంధాలు, నిషేధాలు అమలు జరుగుతున్నాయి. చెరసాలలు, చిత్రహింసలు పెచ్చుపెరుగుతున్నాయి. ప్రజల హక్కులపై ఇలాంటి కఠినచర్యలే ప్రజాస్వామ్యవాదులను మళ్ళీ పోరాటమార్గానికి నడుపుతున్నాయి.

ప్రజలపై ప్రభుత్వంచేసే నాయకులు ప్రజాశ్రేయస్సును విస్మరిస్తే, ప్రజలు తమ కోర్కెలను ఎలుగెత్తి చాటడం సహజమేకదా! ద్విగుణీకృతశక్తితో తమహక్కులను పునరుద్ధరించమని హెచ్చరించడం న్యాయమేకదా! అప్పులతో, ఆకలితో పీడింపబడే ప్రజలపై ఆర్డినెన్సులు ప్రయోగించడం ధర్మమార్గమౌతుందా?.

గత స్వాతంత్ర్య దినోత్సవంనాడు భారతీయ ప్రజలు ఏమహత్తర భవిష్యత్తునాశించారో, ఏ ఆశయాలతో ఆదర్శాలలో ఉప్పొంగిపోయారో, ఆ భవిష్యత్తును స్థాపించటానికే ఈ స్వాతంత్ర్య దినోత్సవం నాడు శపథం చేస్తారు! హిమాలయ శ్రేణు లెదురుక్కున్నాగాని ప్రజా ప్రవాహం తనగమ్యం చేరకమానదు! ప్రజలజేయులు!

---

## 'దిటైమ్స్' లండన్.

"జర్నలిస్టు కర్తవ్యం చరిత్రకారుని కర్తవ్యం వంటిదే - అన్నిటికంటె మిన్నగా సత్యాన్వేషణ చెయ్యడం! వాటిని పాఠకులకు తెలియజెయ్యడంలో అధికారుల ఇష్టాయిష్టాలను బట్టిగాక సత్యానికి వీలైనంత చేరువగా వుండేటట్టు బహిరంగపరచడం!"

---

# అభ్యుదయోద్యమానికి తోడ్పడండి



## ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శుల విజ్ఞప్తి

మహాశయులారా !

ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం ఆంధ్ర సాహిత్యానికీ, ఆంధ్ర జాతీయతకూ అనేక సంవత్సరాలుగా చేస్తున్న సేవ మీరెరిగినదే. సామ్రాజ్యవాదుల దోపిడీ విధానంలో విచ్ఛిన్నమై అజ్ఞానంలో, ఆకలిలో కాలిపోతున్న మన తెలుగుజాతిని పునరుద్ధరించే ప్రగతి చైతన్యాన్ని సృష్టించటానికి మొదటినుంచీ అభ్యుదయ రచయితల సంఘం కృషి చేస్తున్నది. ఆదరం, ఆర్థికస్తోమత కొదువై విషమదశలోనున్న మన వైజ్ఞానిక జీవితాన్ని పునరుజ్జీవింప చెయ్యటానికి; స్వాతంత్ర్య, సమానత్వ, సౌభ్రాతృత్వాల పునాదిపై మన సంస్కృతీ సాహిత్యాలను, నిర్మించటానికి అభ్యుదయ రచయితల సంఘం తన సర్వశక్తులూ వినియోగిస్తున్నది. పూర్వ సాహితీపరుల, దేశనాయకుల ఉత్తమ సాంప్రదాయాలను ఆకళింపు చేసుకుని, నేడు ప్రపంచమంతటా వికసించుతున్న శాస్త్రీయ, తాత్విక, సంస్కృతీ పరిణామాలను ఆస్వాదిస్తూ అభ్యుదయ రచయితలు ఒక వినూత్న జాతీయాభ్యుదయ సాంప్రదాయాన్ని సృష్టిస్తున్నారు. ఆంధ్రదేశమంతటా వ్యాపించివున్న అభ్యుదయ రచయితల సంఘాలు ప్రతి జాతీయోత్సవంలోనూ ప్రజలకు ముందుండి సభలు, గోష్ఠులద్వారా తమ ఆదర్శాలను ప్రబోధిస్తున్నారు. తమ ఉత్తమ రచనలద్వారా ప్రజల సుఖదుఃఖాలను, ఆశయాలకు, ఆవేదనలకు స్వరూపం ఇస్తున్నారు. అభ్యుదయ రచయితలు ప్రజలకూ సాహిత్యానికీ సన్నిహితసంబంధాన్నేర్పరచి తెలుగుజాతి చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించారు.

ఈ ఆశయసాధనకు "అభ్యుదయ" పత్రికను ఒక ఉత్తమాయుధంగా ప్రయోగిస్తున్నాము "అభ్యుదయ"ను ప్రారంభించి నేటికి ఇరవై నెలలు గడిచింది. తెలుగు పాఠకులు "అభ్యుదయపై" విశేషమైన ఆదరాభిమానాలు ప్రదర్శించినా, మన సాంఘిక జీవితంలో నేడేర్పడుతున్న ఆర్థిక సంక్షోభం వల్ల పత్రికానిర్వహణ నానాటికి కష్టతరమౌతున్నది. "అభ్యుదయ" ఎప్పటివలె ఉత్తమ రచనలతో సక్రమంగా వెలువడుతూ తెలుగు జాతికి సేవ చెయ్యడంకోసం, మా పాఠకులు, అభిమానులు ఈ ఆర్థిక దుస్థితిని తొలగించటానికి తోడ్పడమని వినతి చేస్తున్నాము.

"కళ ప్రజలచేతి ఉత్తమాయుధం"గా ఎంచి తమ సర్వశక్తులూ ధారపోసి కృషిచేస్తున్న అభ్యుదయోద్యమానికి, అభ్యుదయోద్యమ కంఠంగా వెలువడుతున్న "అభ్యుదయ"కు తమరంతా విరాళాలు,చందాలు పంపి ఆంధ్రప్రజల వైజ్ఞానిక వికాసానికి తోడ్పడమని విజ్ఞప్తిచేస్తున్నాము



ముఖచిత్ర రచన:

## చిత్తప్రసాద్

........

స్త్రీ పురుషుల సమిష్టి కృషిఫలితంగా మానవ జీవితం సుఖమయమూ, శోభావంతమూ ఔతుంది. పరిశ్రమలో, ఫలానుభవంలో సమానభాగస్వాములైన స్త్రీపురుషులు ఒకవంక ప్రకృతిసంపదను స్వాధీనం చేసుకుంటారు. గనులు త్రవ్వుతారు. పంటలుపండిస్తారు. తాము శాస్త్రజగత్తును శోధించి సృష్టించిన యంత్రాల సహాయంతో తమ శ్రమశక్తిని సద్వినియోగం చేస్తారు. ఆ సహృదయాన్ని, మేధస్సును విశ్వంలోని గుప్తరహస్యాలను గ్రహించటానికి ప్రయోగిస్తారు. జంతువైన నరుడు, జగత్తునిండా వ్యాపించి మానవుడుగా దివ్యమూర్తిగా వికసించటానికి చేసే సమిష్టి కృషికి, ప్రపంచాభ్యుదయానికి చిహ్నంగా ప్రఖ్యాత చిత్రకారుడు చిత్తప్రసాద్ ఈ చిత్రాన్ని రచించాడు.

# "పత్రికలపై తీసుకున్న చర్యలను ప్రభుత్వం పునరాలోచించాలి!"

బొంబాయిలో సమావేశమైన అఖిలభారత పత్రికా సంపాదకుల మహాసభ జులై 25 వ తేదీన ఒక తీర్మానం చేస్తూ పత్రికా స్వాతంత్ర్యాన్ని నిరోధిస్తున్న రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలను ఈ క్రిందివిధంగా విమర్శించింది:

"అనేక రాష్ట్రాలలో అమలులోవున్న ప్రజారక్షణ చట్టాలను, పత్రికలను సంబంధించినంతవరకు, ఇలాగే కొనసాగించడం ఏమాత్రం న్యాయం కాదని ఈ మహాసభ గాఢంగా అభిప్రాయపడుతున్నది. ప్రజాభిప్రాయ స్వేచ్ఛాప్రకటనను నిరోధిస్తున్న ఈ చట్టాలు దుర్వినియోగపరచటానికి అవకాశముండటమేగాక, వాస్తవంగా కొన్ని రాష్ట్రప్రభుత్వాలు దుర్వినియోగం చేశాయి. ఎమర్జెన్సీ చట్టాలపేరుతో పత్రికలపై ఇంతవరకూ తీసుకున్న చర్యలను, పత్రికా ప్రతినిధులతో ప్రభుత్వం పునరాలోచించాలని మహాసభ డిమాండ్ చేస్తున్నది..."

# శ్రీ ఖాసా సుబ్బారావు:

ఏప్రిల్ 25 వ తేదీన దక్షిణభారత జర్నలిస్టుల మహాసభలో ఉపన్యసిస్తూ శ్రీ ఖాసా సుబ్బారావుగారిలా అన్నారు:

"పత్రికలు ఎప్పుడైనా తప్పుచేస్తే, వ్యక్తులను విచారించినట్లే సాధారణ చట్టాల ద్వారా మాత్రమే వాటిని విచారణకు పెట్టాలి... ఇవాళ కమ్యూనిస్టు పత్రిక కావచ్చు; రేపు మరొకటవుతుంది; తరువాత భేదాభిప్రాయం వెలిబుచ్చే కాంగ్రెస్ పత్రికకే ఆ దెబ్బ తగలవచ్చు ఎప్పుడైతే అధికారులు, న్యాయస్థానాలలో విచారించకుండా, స్వయంగా ఏ పత్రికమీదైనా చర్యతీసుకుంటారో, అప్పుడు మిగిలిన పత్రికలన్నీ, దెబ్బతిన్న పత్రికయొక్క రాజకీయ విధానమూ, దాన్ని నిర్వహించేవారూ ఎలాంటి వారైనాసరే ఆ పత్రిక తరఫున నిలబడాలి.

# బ్రిటిష్ప్రభుత్వ ప్రతినిధి!

సంయుక్త రాజ్యసమితి సమావేశంలో పత్రికా స్వాతంత్ర్యాన్ని గూర్చి ప్రసంగిస్తూ బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధి ఇలా ఉద్ఘాటించాడు:

"ఏ అభిప్రాయాలు సక్రమమైనవీ, ఏవి అక్రమమైనవీ అని నిర్ణయించటానికి తన్ను తాను జడ్జిగా నియమించుకునే హక్కు ఏ ప్రభుత్వానికీ లేదు. ఎందుచేతనంటే ఇవాళ త్రోసివెయ్యబడిన అభిప్రాయాలే రేపు ఆమోదింపబడవచ్చు."

వ్యంగ్యరచన

# స్వతంత్ర దినోత్సవ సభలో
# లాఠీరావు
## గంభీరోపన్యాసం

"శాంతిదూత"

స్వతంత్ర దినోత్సవం! ఎక్కడ చూసినా సభలు, ఉత్సవాలు, ఊరేగింపులు. దేశంలో ప్రతి వ్యక్తికి ప్రతి వస్తువుకూ స్వాతంత్ర్యం వచ్చినప్పుడు దాన్ని ప్రకటించక పోవటం న్యాయమా? అందులోనూ, స్వేచ్ఛగా విచ్చలవిడిగా చరించటానికి సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించుకున్న శ్రీశ్రీశ్రీ లాఠీరావు ఊరుకుంటాడా?

సభలలో ఊరేగింపులలో ప్రముఖ పాత్రవహించే శక్తి పుట్టుకతోనే వచ్చింది గదా! తనమాత్రం ఎందుకు ఉపన్యసించ గూడదు? నిన్నగాక మొన్న తన అధికారం క్రింద మోకరిల్లిన కాంగ్రెసువాయన ఇవాళ యం. యల్. ఏ [మరిచాను యం. యల్. ఏ. అంటే ఏమిటి?] అయి ఊళ్ళో వాళ్ళపైన తనకంటె జబర్దస్తీ చలాయిస్తున్నాడు. వేలు సంపాదిస్తున్నాడు. నూపరెంటునే దబాయిస్తున్నాడు!

పోలీసుస్టేషనులో ఒకమూల గోడకు చేరగిలబడి లాఠీరావు దీర్ఘంగా ఆలోచించాడు. ఏం? నేనూ మీటింగు చేస్తాను. ఉపన్యాసం ఇస్తాను, ఏముంది చెప్పటానికి అనేనా? లేకేం! నాకంత చరిత్రవుంది. దేశభక్తులు! అని బడాయి చెప్పుకోగానే సరిపోతుందా? అసలీ దేశభక్తుల్ని సృష్టించిందెవరు? స్వాతంత్ర్యం! స్వాతంత్ర్యం అని కేకలేస్తారు? నేను లేకపోతే వీళ్ళ ధైర్యసాహసాలు ప్రదర్శించే అవకాశమేదీ? కనుక ఇప్పుడే లేస్తాను. దండోరా వేయిస్తాను. పెద్దఖర్చవౌతుంది! నేను తలుచుకుంటే కరపత్రాలు ఊరికే అచ్చువెయ్యరా? పత్రికల్లో ప్రకటించరా? లైట్లు, లౌడ్ స్పీకర్లు, సోడాలు, సినిమాహాలు - మనకు కొదువేమిటి! కనుక వెంటనే బయల్దేరి అమాటేమిటి? - 'సన్మాన కార్యక్రమం' ప్రారంభిస్తాను.

* * *

సాయంత్రానికి ఊళ్ళో ప్రజలు ఆశ్చర్యంతో టాంటాం విన్నారు. ఇదివన్నడూ లేని విచిత్రంగా వాళ్ళకు తోచింది! కాని లాఠీరావు సృష్టించి

న స్వాతంత్ర్యాన్ని అభినందించేవారేరి? నిజంగా ఆ సాయంత్రం లాలీరావు ప్రజల దిగ్భ్రమ చూసి "ప్రజలెప్పుడూ కృతఘ్నులే" నని సిద్ధాంతీకరించుకున్నాడు.

రాత్రి ఏడు గంటలకే మళ్ళీ కరపత్రాలు పంచబడ్డాయి. "అనేక చోట్ల అనేకమంది నాయకుల మీటింగులు వున్నాయని వంకతో ప్రజలు ఏ మీటింగుకూ రాకుండా ఇంటిదగ్గరేవుండిపోవాలని ఉపాయం పన్నుతున్నారు నం. 144 గారి ఆజ్ఞప్రకారం అన్ని మీటింగులూ ఆపివేయబడ్డాయి. కనుక తప్పకుండా రేపు సాయంత్రం మీటింగుకు వేలాది ప్రజలు హాజరుకాకపోతే కఠినంగా శిక్షింపబడుదురని విజ్ఞప్తి చేస్తున్నాము. ఈ మీటింగుకు అన్ని పేటలూ, వీధులూ ప్రతినిధుల్ని పంపి శ్రీ లాలీరావు సందేశం వినకపోతే ఆయా పేటలకు సమిష్టి జరిమానాలు విధింపబడతాయని మనవి చేస్తున్నాము. ఈ ఉత్తరువును అనుసరించి ప్రజలు తమ విధిని నెరవేర్చకపోతే తీవ్ర చర్యలు అమలు జరుపబడతాయని విజ్ఞప్తి చేస్తున్నాము." ఈ కరపత్రం చదువుకుని హాయిగా నిద్రపోక, తలతిక్క ప్రజలు కలవరపడ్డారు. రాత్రంతా వీధులలో బూట్ల చప్పుడు, తుపాకి మోతలు, కేకలు వినిపించాయి. విద్యుద్దీపాలు వెలిగాయి, ఆరిపోయాయి. తల్లులు వెర్రిబాగుల్ళుకాకపోతే, అంతమాత్రానికే పిల్లల్ని మంచాల్లో పండుకోబెట్టి కంటనీరు పెట్టడం దేనికి? పిల్లలూ అమాయకులు గనక తల్లుల కడుపుల్లో తలలు దూర్చి నిద్రపోయారనుకొంటే, పెద్దలంతా తమ తమ గదుల్లో చిన్న చిన్న సమావేశాలు జరిపి మీటింగుకు వెళ్ళాలా వద్దా అని గుసగుస లాడుకోవటం దేనికి?

రాత్రంతా శ్రీ లాలీరావు పట్టణంలో సంచారం చేశాడు. ఎప్పుడూ ప్రజల వెనుక, ప్రజలమధ్య, కాళ్ళమీద, తలల మీద, వీపుల మీద విహరించే తను ప్రజాభిప్రాయాన్ని గ్రహించటంలో ఆశ్చర్యమేముంది.

తెల్లవారుజామునే లారీలు వచ్చి పెట్రోలువాసనతో, పిల్లలఏడుపులతో వీధులన్నీ నింపినై. జాతీయంగా శాంతిరక్షణ కోసం అంతర్జాతీయంగా భారతదేశ ప్రతిష్ఠకోసం కొన్ని అత్యవసర చర్యలు జరుపవలసివచ్చి ఆర్డినెన్సుగారు, తుపాకిగారు వారినాయక బృందమంతా పట్నాన్ని గాలించి కొందరు యువకుల్ని జైలుకు తీసుకుపోయారు.

లాలీరావు ఆజ్ఞప్రకారం తోరణాలు వెలిసినై, ముగ్గులు వేశారు. ధూపదీపనైవేద్యాలను లాలీరావూ, అతనిసహచరులూ స్వయంగా ఇంటింటిని సోదాచేసి ఆరగించి పోయారు.

గాస్ లైట్లు, లౌడ్ స్పీకర్లు అన్నీ వాటంతటవే వచ్చి పడ్డాయి. పవిత్రమైన అశోక చక్రంతో త్రివర్ణపతాక ఎగురుతోంది. మీటింగు పెండాలుమీద ప్రత్యేకంగా లాలీరావు పూర్వులైన వీరయోధులస్మృతి కోసం ఒకతుపాకి చిత్రం అలంకరించబడింది.

ప్రజలలో కొందరు మీటింగుకు వెళ్ళాలని మొండిధైర్యంతో వాదించారు. కొందరు "ఎందుకైనామంచిది మానేద్దాం మనప్రాణం మనకు దక్కితేచాలు" అని భయపడ్డారు.

ఈ చర్చలు, వివాదాలు ప్రజలను చెరుపు చేస్తాయని మొదటినుంచే తెలుసు గనుక సాయంత్రానికి వెయ్యిమంది లాఠీరావులు వీధి వీధికీ తిరిగి వీపులుచరిచి, శిరస్సులను ఆశీర్వదించి మీటింగుకు మనుషుల్ని పోగు చేశారు.

*　　*　　*

వేలమంది ప్రజలు కిక్కురుమనకుండా శ్రద్ధగా కూచున్నారు. వేదికమీద లాఠీ రావు నిలబడి నలువంకలా సగర్వంగా చూస్తూన్నాడు. వేదికముందు కుర్చీల్లోలాఠీ రావు తాత తుపాకిగారూ, ఆయన భార్య టియర్ గాసూ, వాళ్ళ పిల్లలు తుపాకి గుండ్లూ ఆసీనులై వున్నారు. ఒక ఫిరంగి గారు లారీలో కూమని తన సంతతి శక్తి సాహసాలకు మెచ్చుకుంటున్నాడు. వేదిక చుట్టూ ఆర్డినెన్సులూ, నిషేధాజ్ఞలూ భద్రంగా కాపలా కాస్తున్నాయి. లాఠీ రావు గొంతుసవరించుకొని ఉపన్యాసం ప్రారంభించాడు.

"మహాజనులారా! స్త్రీ పురుషులారా! నేడు సుదినం. గత సంవత్సరం ఈనాడే మనకు స్వాతంత్ర్యం లభించింది. మన భారతదేశం సుఖసౌభాగ్యాలతో తుల తూగుతున్నది. ఇక మనకు శాంతి లభించింది. అందుకు ప్రత్యేకంగా మేమూ, మా సహచరులైన ఆయుధరావులూ ఎంతో గర్విస్తున్నాం. మాకృషి మీకు తెలియనిది కాదు. మన స్వాతంత్ర్య పోరాటచరిత్రలో మేము పాల్గొనని ప్రదేశంలేదు. ముఖ్యంగా 1921, 1930, 1942, 1946 సంవత్సరాల్లో రాత్రింబగళ్ళు, పగలనక, తిండిలేక, నిద్రలేక కృషిచేసిందెవరు ? మేమే ! ప్రజలెక్కడ వుంటే అక్కడ మేమెప్పుడూ సిద్ధంగానే వున్నాం. మేం ప్రజలను విడిచిపెట్టి దూరంగా వెళ్ళే అనకాశవాదులం కాము! ముమ్మాటికీ కాము!"

ఇంతలో ఒకమూలనుండి గొల్లున ఎవరో ఏడ్చారు. కొందరు అటు తిరిగి చూశారు. ఆ ఏడ్చేమనిషి "చూడండి! 'హియర్, హియర్' అనమని పొడుస్తు న్నాడు"అని తుపాకివంక చూపించాడు.

"ప్రజల ధైర్యసాహసాలను అడుగడుగునా పరీక్షించుతూ, వారి శక్తికి సాన పెడుతూ వారిని పోరాటవీరులుగా తయారు చేశాం." ("పటప్", "పటప్"అని కేకలు విన్పించాయి.) "ఎవరక్కడ ? మూర్ఖులు, అజ్ఞానులు పటప్ అంటే అనవచ్చు. కొందరు కాంగ్రెసునాయకులు, కమ్యూని స్టులూ అంతా తామే పొడిచేసినట్లూ, మేము దేశద్రోహులమైనట్టూ ప్రచారం చేస్తున్నారు వాళ్ళు మీటింగులు పెట్టీ, పత్రికలు పెట్టి చేసేదుష్ప్రచారానికి అంతూ పొంతూలేదు. మేమలాగ వాగేవాళ్ళం కాదు. మేము కర్మవీరులం. అనుకున్న దేదో చేసేస్తాంగాని కబుర్లుచెప్పి ఓట్లు సంపాదించుకోవడం మాపనికాదు. అధి కారంలో ఉన్నవాళ్ళం, ఉంటున్నవాళ్లం ఉండబోయేవాళ్ళం - ఓట్లతో మాకేంపని! ("దేశద్రోహులుమీటింగుకు గెటవుట్, గెట వుట్"అని మళ్ళీ ఒకమూలనుంచి కేకలు విన్పించసాగాయి) "ఎవరు దేశద్రోహులు? మీరు దేశద్రోహులు! మొదట్నుంచీ న్యాయశాస్త్రానికి బద్ధులమై ప్రజాశాంతి కోసం కృషి చేసీ చేసి అవమానాలు, బాధలు, గాయాలు సహించి దేశసేవ

చేస్తున్న మేమా దేశద్రోహులం! కాదు! ఎన్నటికీ కాదు!" అంటూ లాఠీరావు ఎదురుగా వున్న కమాండర్ మరతుపాకిని, శ్రీమతి టియర్‌గాస్‌నూ వేదికమీదికి పిలిచాడు. వారి యూనిఫారమ్ దుస్తులు విప్పి, వీపున, కాలమీదవున్న గాయాలు ప్రజలకు చూపుతూ "మళ్ళీ అనండి! భారతదేశం ఇంత ప్రశాంతంగా అహింసాయుతంగా స్వాతంత్ర్యం సంపాదించటానికి మా త్యాగంకాదా కారణం? లేకపోతే విప్లవాలనీ, అంతర్యుద్ధాలనీ మీలో మీరు కొట్లాడుకుని భారతదేశాన్ని పరజాతుల్లో నవ్వులపాలుచేసేవారే. దేశంలో పిల్లా జెల్లా మాడి చచ్చేవారే"

ఒకమూలనుండి లాఠీలమోతలు విన్పించినై. లాఠీరావు ఉపన్యాసాన్ని అభినందిస్తూ వెంటనే కరతాళధ్వనులువిన్పించినై. మళ్ళీ లాఠీల మోగిన శబ్దం విన్పించింది. వెంటనే కరతాళ ధ్వనులు, ఏడుపులు ఒక్కసారిగా విన్పించినై.

లాఠీరావు సంతోషంతో ఉబ్బిపోతున్నాడు. మైక్ పట్టుకుని, అద్దం జేబులోనుంచితీసి తన ముఖం చూసుకున్నాడు. ఫొటోగ్రాఫర్లను సైగ చేసి ఆజ్ఞాపించాడు. ఫొటోలుతీసే వెలుతురులో లాఠీరావు ముఖం ఎర్రమతాబాలాగా వెలిగింది.

మీటింగు మధ్యలోనుంచి ఒకవృద్ధుడు లేచి బలహీనంగా స్పష్టంగా మాట్లాడటం మొదలెట్టాడు.

"మహాశయులారా! ఇదంతా నాకాశ్చర్యం వేస్తున్నది. మాచిన్నతనంలో లాఠీ కనపడితే దూరంగా తొలగిపోయేవాళ్ళం. ఇవాళ మనకర్మకాలి, అందులో స్వాతంత్ర్య దినంనాడు, లాఠీ ఉపన్యాసం వినవలసి వచ్చింది. ఈ మీటింగుకు రావటంకంటె చచ్చింది మేలు!"

వెంటనే అనేక లాఠీలు వచ్చి అతన్ని దొబ్బుకుపోతూంటే, ప్రజలు లేవటం మొదలెట్టారు. మొదటి పంక్తిలో కూచున్న తుపాకిగారు, శ్రీమతి టియర్‌గ్యాసూ లేచి ఈ ఆందోళనను సర్దమని ఆర్డర్లు జారీ చేస్తున్నారు.

లాఠీరావుమాత్రం ఉపన్యాసం ఆపలేదు.

"ఈయనెవరో కాంగ్రెసు వాదిలా వున్నాడు. ముసలివాడైపోయి మన నాయకులేమంటున్నారో, మనల్నెంత ప్రేమగా చూస్తున్నారో గ్రహించటంలేదు ఈయనకు జైలుకు పోవటమే తెలిసింది గాని వచ్చిన స్వాతంత్ర్యాన్ని నిలుపుకోవటం తెలియని అమాయకుడు. ఈయన నాయకులే ఇప్పుడు ప్రభుత్వాధికారులై ఆరోగ్యం, విద్య, అధికోత్పత్తికంటే మాకోసం ఎక్కువధనం ప్రత్యేకించారు. మాకోసం అంటే - శాంతి కోసం! మాకోసం అంటే—అహింస కోసం!"

ఉపన్యాసం మధ్యలోనే ఒక యువకుడు లేచి, వెంటనే అందుకుని "వాణ్ణి కిందికి దింపండి. ఈ నికృష్ట పరిస్థితుల్లో మీటింగుకు రావడం నీచాతినీచమైన పని. మనం స్వాతంత్ర్య పోరాటం సాగించిన్నాళ్లూ మన తలలు బద్దలుకొట్టి తుపాకులతో కాల్చి హింసించినవాడు ఇవాళ ధర్మపన్నాలు చెపుతూంటే వింటూ మేకల్లాగా కూచోడం స్వాతంత్ర్య దినోత్స

[తరువాయి 63 వ పేజీలో]

# కాంతులు — కత్తులు



## స్వాతంత్ర్యం : సాహిత్యం

ఆగస్టు 15 1947 ఆనాడు దేశంలో ఉప్పొంగని హృదయం లేదు. అలంకరించని గడపలేదు. నగరాలు, గ్రామాలు, పిన్నలూ పెద్దలూ; ఆనందోత్సాహ సముద్రంలో ఉవ్విళ్లూరలూగని జీవకణం భారతదేశంలో లేదు. నల్లని దాస్యపుతెర విడిపోయినట్లూ, ఎర్రని ఉదయం ప్రభవించినట్లూ తెలుగుజాతి పండుగ చేసింది. కవులూ, గాయకులూ కళాకారులంతా ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. తమ స్వప్నాలు వాస్తవాలైనట్లూ, తమ కన్నులలో స్వాతంత్ర్యజ్యోతి వెలిగినట్లూ కళాకారులంతా వెర్రి ఆవేశంతో ఉద్రేకపడ్డారు. పత్రికలు, రేడియోలు, సభలు, సమావేశాలు- ఎక్కడ చూసినా, విన్నా కళాకారుల సమ్మోహన స్వప్నాలతో, అగాధ సత్యాలతో దేశం మార్మోగింది.

యువకవులు, మహాకవులు, పండితులూ పామరులూ గానంచేసిన స్వతంత్రదిన వార్షికోత్సవం వచ్చింది. కాని, ఒక గొంతుకా వినిపించడంలేదు. సంతోషంతో ఒక్క హృదయమూ ఊగిపోవడంలేదు. పగటికలలాగ, పేకమేడలాగ ఆనాటి దివ్యస్వప్నం కరిగిపోయింది. ఆనాటి సత్యం నేడు దుర్భ్రమగా మారింది.

ఆనాడు స్వతంత్రదినోత్సవం జరిగింది. కాని, మరునాటినుండీ కవుల కుటుంబాలు అప్పులపాలౌతూనే వున్నై. గాయకుల సంసారాలు ఆరిపోతూనే వున్నై. చేసే వుద్యోగంలేక, చూసే అండలేక నేటి చదువులు శాపాలుగా మారాయి! కవిత్వమూ, కళలూ మానవుల ప్రథమావసరాలు తీరితేనేగాని వికసించవు. జంతుతత్వమూ, దోపిడీ, ఈర్ష్యా, అసూయ

## ఒక మాట -

విజ్ఞాన జగత్తులోని అపూర్వ విశేషాలను గురించి ఈ శీర్షిక క్రింద 'క్రాంతివాది' ప్రతినెలా వ్యాఖ్యానిస్తాడు. వ్యాఖ్యానానికి తగిన విశేషాలను, వార్తలను పాఠకులు సేకరించి పంపితే కృతజ్ఞతతో స్వీకరిస్తాడు. — సం.

వికిరనృత్యంచేస్తున్న నేటిసమాజంలో కళ లెక్కడ! కవిత్వమెక్కడ!

ఒకవంక ప్రభుత్వం ఊపిరిసలపకుండా అర్డినెన్సులు సృష్టిస్తోంది. విద్యా విధానాన్ని తలకిందులుచేస్తోంది. ప్రభుత్వమంటే ఎన్నిపనులు! ఎంతఖర్చు! బస్సులమీద పెట్టుబడిపెడితే లాభం తియ్యవచ్చుగాని, కవిత్వంమీద పెట్టుబడి ఎవరికిలాభిస్తుంది? అందుకనే ప్రచురితమైన ఉత్తమగ్రంథానికి [ఉత్తమగ్రంథాలు సాధారణంగా వ్రాసిన పదేళ్ళవరకూ ప్రచురితంకావు. చూ: కృష్ణపక్షము; మహాప్రస్థానం.] రూ 250 లు బహుమానం ఇస్తామని ప్రకటించింది. [పుస్తకం వెయ్యి కాపీలువేస్తే ఖర్చు రూ. 500 లకు తగ్గదని మనవి] ఈ బహుమానానికి ఎంతమంది ఆశిస్తారో ఎందరు యం. యల్. ఏ. లరికమెండేషన్లు దీనికి కావాలో మరి తెలియదు.

కాని, ఒకటే మాకు స్పష్టంగా తెలిసింది. ఏజాతి కళాకారుని హృదయం ఆ జాతిగుండెగా స్పందిస్తుంది. తెలుగుజాతిలో ఆనాటి ఉత్సాహం నేడెక్కడా కన్పించటంలేదు. తెలుగుజాతిలో ఇప్పుడు రెండే రెండు లక్షణాలు కనపడుతున్నాయి. అవి రచయితల్లోనూ స్పష్టంగా ప్రతిబింబిస్తున్నాయి ఒక రచయిత పోరాడుతున్నాడు. మరొక రచయిత నిరాశలో పడిపోతున్నాడు.

ఆగస్టు 15 న ఎత్తవలసింది జండాలు కాదు, గుండెలు!

## బెర్నార్డ్ షా

బెర్నార్డ్ షా తన మొట్టమొదటి గ్రంథం ప్రచురించుకున్న వెంటనే ఒక పుస్తకాల షాపుకు వెళ్ళి యజమానితో ఆదుర్దాగా "మీ దగ్గర బెర్నార్డ్ షా పుస్తకాలేమైనా వున్నాయా?" అని ప్రశ్నించాడు. యజమాని తాపీగా "మా దగ్గరలేవు. అసలు బెర్నార్డ్ షా ఎవరు?" అని అడిగాడు. దానికి షా తక్షణమే సమాధానమిచ్చాడు. "అరె! బెర్నార్డ్ షా తెలియదూ? ఇప్పుడతనికంటె గొప్ప రచయితలేడు."

బెర్నార్డ్ షా సాహిత్యంలో హాస్యం సూత్రప్రాయంగా సాగుతూంటుంది. కాని, దాని చుట్టూ అనేక అభిప్రాయాలు ఆశయాలు, సిద్ధాంతాలు పూసగుచ్చినట్లుంటాయి. వైద్యమూ, వేశ్యావృత్తీ, పార్లమెంటు నిర్మాణమూ, పరిణామ సిద్ధాంతమూ, సాహిత్యం, సామ్యవాదం, అన్నిటినీ అతను విమర్శించాడు. వెక్కిరించాడు. మార్పులు సూచించాడు. సిద్ధాంతీకరించాడు.

ఆధునిక విజ్ఞానవేత్తలలో అతను అగ్రగణ్యుడు. శాస్త్రవిజ్ఞానమూ, తత్వశాస్త్రమూ అన్నిటినీ అతను మధించాడు. అతనిగ్రంథాలను ఒకప్పుడు నిషేధించారు. ఈనాడు లక్షలకొలది ప్రతులు అచ్చువేసి అమ్ముతున్నారు. ఆశ్చర్యంలేదు! అతని ప్రత్యేకత అదే. అతను బూర్జువాసమాజంలోని కుళ్ళును బట్టబయలుచేసి ఆ యా అధికారవర్గాలను వెక్కిరించాడు. వాళ్లూ సరదాగా నవ్వారు. పారితోషికాలిచ్చారు. వాళ్ళనే గనుక అతను భయపెడితే వాళ్లు పారితోషికాలిస్తారా? బందిఖానాలిచ్చేవారు.

మొన్న జులై 26 వ తేదీతో షా కు

తోంభై రెండేళ్ళు ఇంకా ఉత్సాహంతో ఒక నాటకం వ్రాస్తున్నాడు. ఇప్పటికీ చురుగ్గా పత్రికలకు లేఖలు, వ్యాసాలు వ్రాస్తాడు. ఈమధ్యనే పార్లమెంటు లేబర్ సభ్యుడు మైకేల్ ఫుట్‌తో తూర్పు యూరప్ రాజ్యాలలో, సోవియటు యూనియన్‌లోనే నిజమైనప్రజాస్వామ్యం వుందని వాదించాడు.

షా ఒకనాటకానికి "విప్లవకారుల ప్రథమవాచకం" అనే అనుబంధాన్ని చేర్చాడు. అందులో ఒక సూత్రం ఇది:

"ముప్ఫైయేళ్ళలోపు మనిషి విప్లవకారుడు కాకపోతే అసలు మనిషే కాడు"

## తుపాకి నీడలో!

ఒక సోదర రచయితవచ్చి నాతో అన్నాడూ; 'నారచనలన్నీ పోయాయని' 'వేలూరివారి రచనల్లాగ హఠాత్తుగా అగ్నికాహుతికాలేదుగద!', 'కాలేదు' 'మరెలాగ పోయినై' అని జాగ్రత్తగా అడిగాను. నెమ్మదిగా గాద్గదికంగా "పోలీసులు సోదా చేశారు.ఇట్లో ఏమీ మిగల్లేదు నా రచనలూ మిగల్లేదు' అన్నాడు. 'ఏం మిగిలాయి?' అన్నాను. 'తలుపులు తప్ప ఇల్లంతా మిగిలింది' అన్నాడు. నేను నిర్ఘాంతపోలేదు. మేఘం నీడ నామీద వాలితే ఆశ్చర్యపడుతున్నానా? ఊహు! అలవాటు. అలాగే తుపాకి నీడలుగూడ అలవాటైపోయినై. ఐతే, మేఘాలు వర్షిస్తే భూములు పండుతాయి. తుపాకులు వర్షిస్తే గుండెలు పగులుతాయి! అంతే!

అనేకమంది రచయితలు ఖైదుల్లో వున్నారు ఎప్పటిలాగే! ప్రభుత్వాలకంటే ప్రజలు ముందుంటారు ప్రజలకంటే రచయితలు ముందుంటారు. భవిష్యత్తులోకి వెళ్ళే తోవ ఖైదులోంచే వెళుతుంది!

ప్రసిద్ధ సాహిత్య గ్రంథాలు అనేకం ఖైదుల్లోనే పుట్టాయి. తర్వాత తరాలు వాటిని ఉత్తమోత్తమంగా పరిగణించారు. బైబిల్ తప్ప మరే గ్రంథమూ చదవని జాన్ బనియన్ "పిల్‌గ్రిమ్స్ ప్రోగెస్" ఖైదులోనే వ్రాశాడు. ఉన్నవవారి 'మాలపల్లి' ఖైదులోనే తయారయింది. సాహిత్యంలో కొన్ని ముఖ్య గ్రంథాలు ఖైదులోనే జన్మించాయి. ఈ గ్రంథాలను గూర్చి మరొకసారి [illegible] చేస్తాను.

ఖైదీల వాస్తవ జగత్తుకు హద్దులుంటాయిగాని మానసిక జగత్తుకు హద్దులేవి? ఎవరెవరి కాంక్షలనుబట్టి వారు సాహిత్యాన్ని సృష్టిస్తారు. ఒకరు "జైలులో చందమామ" వ్రాస్తే మరొకరు సమాజాన్ని తరతరాలుగా కలచే విప్లవ నాటకాలు వ్రాస్తారు. ఎర్నెస్టుటాలర్ జైలులో నుంచి నాటకం వ్రాసి బైటికి పంపితే జర్మనీలో, ఇంగ్లండులో, అమెరికాలో ప్రేక్షకులు ఉద్రేకంతో ఊగిపోయారు.

## 'ఉరితీయబడిన శిరస్సు చెప్పిన రహస్యం'

ఖైదులో సాహిత్యాన్ని సృష్టించేవారు రెండు తెగలు: ఒకరు, తమ బాధలను, ఆవేశాలను నిరాఘాటంగా వెళ్ళబోసుకునేవారు. మరొకరు, లోకానికి దూరంగా కూచొని; నేడో రేపో మృత్యుసందర్శనం తప్పదని గ్రహించి కూడా

ఒక హిమాలయోన్నత శిఖరాన్నధిష్టించి, నిశ్శబ్దంగా మానవజంతువు పరిశీలించి ధర్మమూర్తి కంఠంతో ఆదేశించేవారు. ఈ రెండవ తెగకు చెందినవాడు జూలియస్ ఫ్యూజిక్. జెకోస్లోవేకియా రాజకీయ, సాహిత్యరంగాలలో ప్రసిద్ధిపొంది, "రూడీ ప్రవో" (Rude pravo) అనే కమ్యూనిస్టు దినపత్రికకు, "ఈబ" అనే సాహిత్య పత్రికకూ సంపాదకుడుగా పనిచేస్తూ, నాజీల చేతుల్లో పట్టుబడి అమానుషమైన చిత్రహింసలకు గురియైనాడు. అతి భయానకమైన జీవితం గడుపుతూనే, రోజూ రహస్యంగా కాగితపుపీలికలమీద పెన్సిల్‌తో వ్రాసి, తన్నభిమానించే ఒక గార్డుద్వారా బైటికి పంపాడు. అతన్ని నలభయ్యోయేట బెర్లిన్‌లో నాజీలు ఉరితీశారు. తర్వాత మళ్ళా, జైలునుంచి విముక్తులైవచ్చిన అతని భార్య ఆగస్టినా ఫ్యూజిక్ ఆ గార్డును కలుసుకుని, కాగితపు పీలికలన్నీ పోగుచేసి పుస్తకం ప్రచురించింది.

ఈ గ్రంథాన్ని ఊరికే పెన్సిల్‌తో వ్రాయలేదు. తన ఆత్మాగ్నితో వ్రాశాడు. "ఒకవేళ ఈ గ్రంథం పూర్తిచెయ్యకముందే నన్ను ఉరికంబాలు బలితీసుకుంటే బైటవున్న కోట్లకొలది ప్రజలు దీనికి చరమాంకం వ్రాసి సుఖాంతం చేస్తారు" అని ప్రవేశికలో అంటాడు.

మానవ విజయంమీద ఎంత విశ్వాసం! ఎంత ఆత్మశక్తి! ఆయన వ్రాసిన చివరి పంక్తిలో ఈ హెచ్చరిక మీకూ, నాకూ అందరికీ వర్తిస్తుందిగదా: "నా జీవిత చరమాంకంమీద యవనికవాలుతున్నది. నేను మిమ్మందరినీ ప్రేమించినవాణ్ణి, తస్మాత్ జాగ్రత!"

## కొత్త సామెతలు:

"జనం ఉన్నారు, భోజనం లేదు!"

... ...

"మరణంకంటె రణం గొప్పది!"

... ...

"ఉన్నవారు ఉవ్విళ్ళూరితేనేం, లేనివారు లేవకపోతేగా!"

## ద్రోహులున్నారు జాగ్రత!

జూలై నెల "అభ్యుదయ"లో రావణుడు, ధర్మరాజు ఇంకా అనేకమంది పౌరాణికులు రచనలు చేశారు. ఇంత చిత్రమైన పురాతనమైన పేర్లు తప్ప మరేవీ ఈ రచయితలకు లభించలేదా అనుకుంటారు పాఠకులు కాని, వాళ్ళకేం తెలుసు? హైద్రాబాద్ జైళ్ళలో మగ్గుతున్న దేశభక్తుల గుండెలనుండి, గోడలు దాటి, తుపాకుల కోటలదాటి, నైజాం హద్దులు దాటి ఈ రచనలు సుదీర్ఘ ప్రయాణంచేసి వచ్చి "అభ్యుదయ"ను అలంకరించాయని! ప్రజాద్రోహులపైనున్న 'క్రోధం' పురాతనమైనది. మహానది ప్రవాహంలాగా తనకు అడ్డునిలిచే వాటన్నిటినీ త్రోసుకొని ముందుకురుకుతుంది. నదికైనా ఆనకట్ట నిర్మించవచ్చుగాని, చరిత్రనెవరెదుర్కోగలరు?

ఈ సత్యాన్ని హాయిగా విస్మరించి, మత్తునిద్రలో సుఖస్వప్నాలు కంటున్నవారు ఇంకా కొందరున్నారు. ఆస్తి, అధికారమూ వచ్చి కన్నులు, వీనులు కప్పివేస్తే ఇక విముక్తి ఎక్కడ! హైద్రాబాదు రేడియోలో "ఆదర్శ ప్రభువు" నైజాంను గురించి ఉపన్యాసాలు వినిపించటంలేదూ? నమ్మండి!! "నైజాం ప్రభువు హిందూ ముస్లిములను కన్నబిడ్డలవలె కాచుచున్నా"డని కళ్ళులేని రేడియో చెపుతోంది! నమ్మండి!! యంత్రాలు వాటంతటవే ప్రచారం చెయ్యలేవుగదా! వాటి వెనుక ఒకానొక వ్యక్తి మాట్లాడుతుండాలిగదా! అందుకని శ్రీ కురుగంటి సీతారామభట్టాచార్యులు ఆ విధి నిర్వర్తిస్తున్నాడు. ఈయన "ఆదర్శప్రభువు" అనే శవస్తోత్రం ఒకటివ్రాసి బహుమానాలు పొందాడు. దాన్ని తిరిగి అచ్చువేయించాడు. నైజాం ప్రభువు అడుగులకు మడుగులొత్తే ఈ పెద్దమనిషికి ప్రభువు వారి పాదాలు అడ్డువచ్చి వాస్తవం కన్పించక, అనుకున్నాడుగదా "భారత దేశంలో ఇతర ప్రాంతములలోవలె, హైదరాబాదు నందు మతకలహములు మందుకైనను లేవు" అని. ఈయన అజ్ఞానానికి మేము విచారించం. అది అజ్ఞానం కాదు గనుక! అది పరిపూర్ణ జ్ఞానంతో ఆరితేరిన బానిసచేసే ప్రచారం. ఈయన బాహాటంగా రేడియోలో ఈ బానిసబుద్ధిని ప్రచారం చేసుకోవడంచూస్తే మానవునికి అధమాధమస్థాయిలో సిగ్గు బిడియాలు గూడనశిస్తాయనిపిస్తున్నది.

ఈయన సోదరులు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగూడ ఒకచోట పండితులుగా పనిచేసి రిటైరై, విద్యార్థులు నైజాంకువ్యతిరేకంగా వరంగల్ కాలేజీలో సమ్మెచేస్తే దాన్ని విచ్ఛిన్నంచెయ్యటానికి ప్రిన్సిపాల్ గా తయారైనాడు!

ఒకాయన నవ్యాంధ్ర సాహిత్యవీధుల్లో కొన్నాళ్ళు షికారుచేశాడు. మరొకాయన ఆంధ్రావళితో నేస్తం కట్టాలని ప్రయత్నించాడు.

ఇంకొకాయన చరిత్రకారుడుగా, జర్నలిస్టుగా ఏదోఏదోగా దేశమంతా తిరిగి, ఆయన చరిత్రవిజ్ఞానంతో నైజాం పాదాభిషేకంచేస్తున్నాడు. కాని, రాజులకోటల్లో నడిచే చరిత్ర స్మశానంవేపు వెడుతుంది ప్రజల హృదయాలు నిర్మించేచరిత్ర ఉన్నత జీవితస్వర్గానికి దారితీస్తుంది!

తెనుగుతల్లి రొమ్ముగుద్దే ఈ పెద్దలకు ఈ ప్రథమ సత్యం తెలియదు. కాని, నిరక్షరాస్యులైన లక్షలాది తెలంగాణా ప్రజలీ సత్యాన్ని అనుభవించారు. అందుకే గొంతెత్తి స్వేచ్ఛగా పాడుతున్నారు. కటకటాలు దాటి, హద్దులు దాటి వారి కంఠాలు విన్పించి తెలుగు సోదరులు పులకరిస్తున్నారు. కాని, వారి కంఠాల్లో ఒక జీరవుంది. అది ఇలాగ అంటోంది:

"ద్రోహులున్నారు జాగ్రత!"

## మీకు తెలుసుగదూ?

★ ప్రజాస్వామ్యానికి ట్రేడుమార్కు పుచ్చుకుంటానంటున్న అమెరికాలో మాసచూసెట్స్ రాష్ట్రం షేక్స్పియర్ నాటకం "హామ్లెట్" ప్రదర్శనను నిషేధించింది.

(మిగతా 68 వ పేజీలో)

# నిరపరాధ పరిశోధన

★

"అగ్నివీణ"

ఒకానొక దేశంలో, ఒకానొక కాలంలో ఒకానొక ప్రభుత్వం ఆరితేరిన సైంటిస్టుల్ని ఆహ్వానించి ఒక కొత్త యంత్రాన్ని కనిపెట్టించింది. ఆ యంత్రాన్ని నగర మధ్యంలో స్థాపించింది. ఏ పౌరునికే అదృష్టం వున్నదో ఆయంత్రం తెలియజేస్తుందని ప్రకటించింది.

యంత్రం నోట్లో బేడ బిళ్ళ వేస్తే, ఒకముక్క బైటికి వస్తుంది. వెనుక పక్క సినిమాతార చిత్రమూ, ముందు ప్రక్క అదృష్ట దురదృష్టాలు తెలిపే వాక్యమూ వ్రాసి వుంటాయి.

యంత్రంస్థాపించిన ఉదయాన్నే జనం యంత్రం చుట్టూ గుంపులు గుంపులుగా మూగారు. ఆశతో ఉప్పొంగి పుల్లాడుతున్నారు. కాని, ఆ సమూహంలో సాదా బట్టలు కట్టుకుని అనేకమంది ఎందుకో తారాడుతున్నారు.

మొట్ట మొదట ఒక ఉన్నతోద్యోగి, బలగం వున్నవాడు గనుక, చేతి కర్ర ఆడించుకుంటూ ముందుకు వచ్చాడు. బేడా బిళ్ళ వేసి ఆదుర్దాగా మీట నొక్కాడు. వెంటనే టికేట్ ముక్క ఒకటిరాలింది. దానిమీద "పర్మిట్" అని వ్రాసి వుంది. ఆయన తన గుట్టు బట్టబయలౌతుందని గాభరాగా టికెట్టు జేబులో వేసుకుని చర చర వెళ్ళిపోయాడు.

ఇంకొకాయన గాంధీ టోపీ పెట్టుకుని ఖద్దరు కండువా వల్లెవాటుసవరించుకుంటూవుండాగా ముందుకు వచ్చి యంత్రాన్ని ఆజ్ఞాపించినట్లు చూస్తూ బేడా వేశాడు. టికెట్టు చూసి నిండుగా 'హు!' అంటూ వెళ్ళి పోయాడు. దాని మీదకూడా "పర్మిట్"అని వుంది.

తర్వాత కొత్తగా మెరుస్తున్న కారులోంచి దిగి ఒక వర్తకుడు సేలం అంచుకండువా సవరించుకుంటూ వచ్చి బేడా వేశాడు. అతనికి ఆశ్చర్యం వెయ్యలేదు.

(మిగతా 68 వ పేజీలో)

# "గీతాంజలి" నుండి
# రెండు గీతాలు

★

అనువాదం :

**ప్రయాగ**



ఎక్కడ
హృదయం భయోద్విగ్నం కాక
తలయెత్తుకు నిలబడగలమో;
ఎక్కడ, విజ్ఞానం స్వచ్ఛందమో;
ఎక్కడ, జగత్తు ఎక్కడికక్కడ
లోలోపల
సంకుచితంగా గోడలు కట్టుకు
విచ్ఛిన్నం కాలేదో
ఎక్కడ, సత్యపునిమ్నోన్నతాలను
భాషలు ప్రకటిస్తాయో;
నిరంతర మానవ కృషి
ఎక్కడ, పరాకాష్ఠ చేరుతుందో;
మృతాచారపు ఎడారి బయళ్లలో,
ఎక్కడ, శుభ్రహేతు స్రోతస్విని
ఇంకి క్రుంకి పోలేదో;
ఆ విశాల భావనలో,
ఆ ఉదార వర్తనలో,
ఎక్కడ, నిర్మల హృదయం
పయనిస్తుందో ముందుకు
తండ్రీ, ఆ స్వతంత్ర స్వర్గంగా
నా దేశం ఫలించనీ!

ఇదే నా ప్రార్థన ప్రభూ!
నా హృదయంలో కిల్బిషాన్ని
కూకటి వ్రేళ్ళకు నరుకుము!
సుఖం దుఃఖం తేలిగ్గా
భరియించే బలం ఇవ్వు!
నా ప్రేమను జనసేవలో ఫలవంతం
చేసుకునే బలం ఇవ్వు!
అనాథులను బాధితులను
విడకుండే బలం ఇవ్వు!
దురంత పాశవ శక్తికి
లొంగిపోని బలం ఇవ్వు!
క్షణ క్షణార్భాటాలకు
అతీతమై నా మనస్సు
నిలిచేందుకు బలం ఇవ్వు!
నీ ఆశయ సాధనకై
నా శకులు సర్వస్వం
బలి చేసే బలం ఇవ్వు!

# శిక్షాపత్రం!

ఒకనాడు
గల గలా ఫెళ ఫెళా
విరిగి పడిపోతుంది
నీరంగు గాజు పెంకుల మేడ !

ఒకనాడు
తెరచుకొని పరుచుకొని
బోను విడివస్తుంది
క్రౌర్యమను పశుపు వన్నెల
పెద్దపులి!

ఒకనాడు
వేదం శాస్త్రం విజ్ఞానం
పట్టణాలు పల్లెటూళ్లు
ప్రాక్పశ్చిమాల విషపుపరిధుల్లో
తిరిగి తిరిగి గిర్రున తిరిగి తిరిగి
పిడికెడు బూడిదలో పేర్లు
వ్రాసికొనును!

కాని—నీ
కనురెప్పల సందులనుండి
బ్రతుకుగోడ చీలికలనుండి
వినవచ్చును ఒకకష్టజీవి మూలుగు !
ఒక పేదవాని యీలుగు !

కనవచ్చును,
నీయుద్ధానికిస్వార్థానికిబలి యిచ్చిన
సైనికలోకపు సీసపునాలుకపై
కసితో కత్తులు !కసికత్తులు!

ఎప్పుడో ఎప్పుడో
న్యాయం తన భయంకర
ఛత్రం విప్పినపుడు
ధర్మకత్తుల బావుటా
ఎగురవైచి నప్పుడు
గతచరిత్రలు నక్షత్రాలై
కన్నీళ్లు కార్చినప్పుడు
ఓవ రకుడా! ప్రభుత్వాధ్యక్షా!!
ఓస్వార్థజీవీ!
మీరే జవాబుదారీ
మీకే శిక్షవుంది!

అదిగో అదిగో
భావిమైదానంలో మీకోసం
విద్యుత్ రజ్జులతో ఉరివుచ్చులు!
ఉరివుచ్చులు!
నవ్వే అరచే చప్పట్లు చరచే
చీకటి ఉరివుచ్చులు!

★ సోమసుందర్ ★

# ఖరార్ నామా

జన్మెత్తిన మానవునకు
జీవితమే పరమధనం!
అయితే అది ఒకమారే
అతని కొసగబడిన వరం!
పుట్టలోని పురుగులవలె
పుట్టి పెరిగి...
సంఘంలో తావులేక
అస్తిత్వ ప్రయోజనం
ఊహకు అందనిదవగా
తనచరిత్ర చెరిపేసుక
తనదారిని వెళిపోయే
మానవుడి కపుట్టబోడు
సుడిగుండంలో పడితిరగడు!!
పిరికితనపు సిగ్గులకగ్గలమై
దగ్ధపటలమై...
పొగమూరినభూతకాలమర్యాదలు
వ్రేలాడిన బూజులు...
వేటాడే భూతాలై నిను
తరుము తూంటె,
పిరికిమందు తింటావా? నరుడా?
వీరునివలె తిరుగుబాటు చేస్తావా?

నీవే ఒక సిపాయివై
నీకోటుకు అంటుకొన్న
పురాకాల పీడకలల
మంచుబొట్లు విదిలించేయ్!
మనిషీ! నీరక్తాన్నర్పించేయ్!
నీత్యాగం వృథాకాదు!!
నీత్యాగం వృథాకాదు!!
మనిషీ మనిషిని పీల్చని
పీడించని, దోచని,
వర్గరహిత స్వర్గానికి
శంఖుస్థాపన జరుగుతోంది!
పుట్టే నీ బిడ్డడు
దరిద్రమున దోపిడిలో
బ్రతుకలేడు! బ్రతుకడు!
పుట్టే పాపాయిక ఏవో
లేనిపోని ఆశలనిచ్చెన్లనునిర్మించుక
నిట్టూర్పుల వంతెనలను కట్టుక
స్వప్నాలోకనలో ఊహిస్తూ
స్వర్గలోక సౌఖ్యాలను తలపోస్తూ
బ్రతుకలేడు బ్రతుకడు!
ఉన్నదొకటే జీవితమే!

వీరునిగా మానవునిగ
బ్రతుకుము నరుడా!
చరిత్ర నీకోసం
ప్రసవబాధ పడుతూన్నది!
భవిష్యత్తు నీకోసం
పడిగాపులు పడుతున్నది!!
ప్రయోజనం లేని బరువు శేళ్లు
మోసిమోసి బడుగై పోయిన
దరిద్రమున కనలు బ్రతుకు
గొలుసులోని కుక్క బ్రతుకు
చాలు చాలునరుడా! బ్రతుక లేవు
ఎపుడో అజ్ఞాతయుగంలో
నీపైకప్పబడిన దుష్పల్లే
దుష్ఫలితాలై... దుర్భరమైనా-
తొలగించే శక్తిలేక
మరణబాధతో గిల గిల
తన్నుకొనేందుకు
జన్మించావా? మనిషీ?
ఉన్నది ఒకబ్రతుకే
గతమును ఒక్కసారి విస్మరించు!
శూరుడవై శృంఖలముల ఛేందిచు!
ప్రభవించే శాంతిజగతి
సువర్ణదీధితి నీకే ముమ్మాటికి
నీతమ్ముల కే... మనిషి!
నీరాజన మిస్తుంది!
స్వేచ్ఛకై జరిగే విప్లవసమరంలో
క్షతగాత్రుడవై పడిపోయినమనిషీ!
గాయపడిన సింహంవలె
గర్జించిన నీకంఠధ్వని
రాబోయేస్వర్ణయుగానికిజయభేరీ!
నీజీవిత మొకరహదారీ!
నవసమాజ వ్యవస్థకే
బీజాక్షరనామకరణమహోత్సవం!
నీగొంతుకొసలు దేశభక్తి
నిర్వచనాలై కలకాలంనిలుస్తాయి.
జీవిత బలిదానం చేసినమనిషీ!
నీవచనాలే లోకపుఅంతిమ
ఘడియలవరకూ ప్రతిధ్వనిస్తాయి!!

## కావ్య రంగం

ఫ్యాక్టరీలు ఉన్నంతకాలం నేను పద్యాలు రాసితీరుతాను.

"జనసామాన్యం కవిత్వం వాంఛించదు" అనడం "జనసామాన్యం ఊపిరి పీల్చదు" అనడంలాంటిదే—

"నీకవిత్వం... నాకవిత్వం... ఇంకోడి కవిత్వం... వాంఛించ లేదంటే"
అది—నీతప్పా... నాతప్పా... ఇంకోడితప్పా... అంతే!

శ్రీ శ్రీ

# జాగృతి

ఒక వెల్లువ ఉవ్వెత్తుగ
లేస్తుందని—

ఒక పెనుతుఫాను
వీస్తుందని—

సకల జగతి జాగృతి
దీపిస్తుందని—

అగ్ని పర్వత హృదయం
బ్రద్దలుగా పగిలి 'లావా'
ప్రవహిస్తుందని—

చిరిగిన చొక్కాలై
చివికిన జీవితాలు!
రహదారికి ప్రక్కన
రాళ్ళగుట్టలై
కూలిన జీవితాలు!

అధికార మదాంధులపై
తిరుగుబాటు జేస్తాయని—

జగత్తులో ఇపుడిపుడే
చిగురించే చైతన్యం
గగనం కెగబ్రాకి లేచి
కదలని సింహాసనాలు
కంపింపగ జేస్తుందని—

ఆకలితో, ఆవేదనతో
అల్లాడే అనాథులార్తులు
ఆఖరు క్షణానికైనా
అంతా ఒకటౌతారని
శాంతిని స్థాపిస్తారని—

నాకూ - నీకూ
మేల్కొని చూచే అందరికీ
నాడు తెలుసు!
నేడు తిరిగి తెలుస్తోంది!

★

★ కీ॥ శే॥ యాదగిరి ★

# నాజీ నైజాం

[ఈ పాట యాదగిరి వ్రాయలేదు. పాడాడు. తెలంగాణా ప్రజల ఉజ్వల పోరాటంలో పాల్గొంటూ, అక్షరజ్ఞానమైనాలేని యాదగిరి తన హృదయావేశాన్ని వెళ్ళబోసుకోడానికి ఈ పాట కట్టాడు. నైజాం రాక్షసత్వాన్ని రూపుమాపే వేల కొలది తెలంగాణా ప్రజల ద్వేషాగ్నిని ఈగీతం బాహాటంగా చాటుతోంది. అందుచేతనే తెలంగాణాలో ఈపాటపాడని గ్రామం లేదు. ఇల్లులేదు. గుండెలేదు.

తిరుమలగిరి పోరాటంలో వీరమరణం పొందిన యాదగిరికి అంతకంటె స్మృతి చిహ్నం మేంకావాలి? — సం.]

నైజాం సర్కారోడ! నాజీలనుమించినోడా!
యమబాధ పెడితివి కొడుకో నైజాం సర్కారోడా!
పండిన పంటనంతా తిండికైన ఉంచకుండా తీసికెళ్ళినావు కొ॥
దున్ననూభూమిలేక, పండనూఇల్లులేక పరదేశమైతిమి కొ॥
కంచారుగాడ్దెలను, లంచగొండుద్యోగులను నీవుపెంచినాడవు కొ॥
నీపోలీసుమిలటరీజూసి మేము లొంగివస్తమని బల్ ఆశపడితివి కొ॥
పోలీసుమిలటరీగాని, లాఠీదెబ్బలుగాని
తుపాకికాల్పులుగాని మిషనుగన్నులుగాని
తుపాకి, బాంబులుగాని మీరెన్ని తెచ్చినగాని
మేములొంగిరాము నైజాంకొడుకో॥
పోరాడుతాముర॥
చుట్టూనుసూర్యాపేట, మధ్యానసల్లగొండ, తరువాత హైదరాబాద్
అవతాలగోల్కొండా—గోల్కొండ ఖిల్లాకింద
నీగోరీకడతాముర॥



# విశ్వకవి రవీంద్రుడు

శ్రీమతి
సరోజినీ నాయుడు

కవులు ప్రపంచమంతటా వున్నారు. ప్రపంచమంతటా సంగీతం వుంది. సౌందర్యము ప్రపంచంనిండా వున్నది. కాని, లోకం మూలమూలలావున్న లక్షలాది ప్రజలు రవీంద్రుని గౌరవించి, ప్రేమించి, ఆరాధించటానికి కారణమేమిటి ?

ఆయన జన్మించింది బెంగాల్లో. ఆయన మేధో సంపద, సాంప్రదాయము బెంగాల్‌వే. ఆయన కవిత్వంలోని ప్రకృతి దృశ్యాలు, గ్రామీణ జీవితమూ, పువ్వులు, నదులు, ఆగస్టు నెలలో నదులపై భారంగావాలే వర్షామేఘాలుకూడా - అంతటా తన బెంగాల్ జీవితమే ప్రతిఫలిస్తుంది. కాని, ఆయన విశ్వకవి! ఆయన భాష ఏ కొద్దిమందికో తెలుసు. కాని అది లక్షలాది ప్రజల హృదయస్పందనగా మారింది. ఈ రహస్యం ఎక్కడుంది? ఆయన సందేశమేమిటి ?

**మానవజాతిని ముంచెత్తే ఆయన గాఢమైన ప్రేమ–ఆయన రహస్యం! మానవసేవ - ఆయన సందేశం!**

ఒకప్పుడు తన గ్రామకుటీరంలో కూచుని, మరొకసారి హిమాలయ పర్వత ఛాయలలో విశ్రమిస్తున్నప్పుడు, నదిపై ప్రయాణంచేస్తూ తరంగాల పాటలు వింటున్నప్పుడు, శాంతినికేతన్‌లో తన అనుచరులమధ్య దేవదూతలాగ కూర్చున్నప్పుడు "మానవజాతియొక్క నిశ్శబ్దశోక సంగీతం" ఆయన విన్నాడు. స్త్రీ పురుషుల హృదయాలలోకి తన మనోనేత్రంతో తేరి చూచాడు. వారి సుఖదుఃఖాల పరమరహస్యం గ్రహించాడు. తను దర్శించిన ప్రకృతివల్ల ప్రపంచమంతటా వ్యాపించివున్న ప్రకృతి దృశ్యాలను సాక్షాత్కరించుకున్నాడు. కంఠమెత్తాడు, గానంచేశాడు ఆగానంలో లోకపు సంతోషం వెలుగై వ్యాపించింది. ఆయన వినతకంఠుడై గానంచేసినప్పుడు ఆ గానం లోకపు శోకంలాగ ఆక్రోశించింది. ఆయన కండ్లెత్తి పసిపిల్లల ఆటపాటలు చూచినప్పుడు ఆ రచనలో సంగీతం జాలువారింది. మానవజాతిలో నిత్యమూ జరిగే సంఘర్షణకు ఆయన హృదయం శోకంతో వికావికలైనది.

మంచుబిందువులు ఆయన పాదాలను కప్పివేసేవి. ఆయన శిరస్సుపై నక్షత్రాలు తాండవించేవి. మహానదుల సంగీతం వింటూ, పర్వత శిఖరాల వెనుక అస్తమించే

సూస్తున్నారా - వీటన్నిటినీ ఆయన కవితాజగత్తులో పునఃసృష్టి చేశాడు.

## మానవైక్యత ఆయనలక్ష్యం

ఆయన ప్రపంచమంతా సంచారం చేశాడు. గ్రహిస్తూ, యోచిస్తూ, తపస్సు చేస్తూ! ఆ గాఢమైన అనుభవంతో, విశాలమైన దృక్పథంతో తన కవితాజగత్తును నింపాడు. భారతదేశ సంపదయైన వేదాలు, తత్వశాస్త్రమూ పఠించాడు. ప్రపంచదేశాల సాహిత్యమూ, కళలూ ఆస్వాదించాడు.

ఆయన గ్రంథపఠనం, యోచన, సంచారం, అనుభవమూ - అన్నీ ఒకే నిశ్చలవిశ్వాసాన్నిచ్చాయి: మానవైక్యత అవిచ్ఛిన్నమని!

ఆయన యౌవనంలో మహాభావుకుడు. అతనికవనం భావుకతతో ఉద్రూతలూగేది. యువకులకు సహజమైన ఉద్వేగం ఆయన గీతాలలో వెల్లివిరిసేది. మధ్యవయస్సులో వ్రాసిన గీతాలలో ఉద్వేగపు పాలు కొంతతగ్గి, ప్రశాంతత అలవడింది. కాని, వృద్ధాప్యంలో తిరిగి ఆ యౌవననాటి కవితాగుణాలే విజృంభించాయి.

ఆయన యువకులతో కలిసి మెలిసి బ్రతికేవాడు. వారి సంతోషంచూసి ఉత్సాహంపొందేవాడు. వారి భావాలు విని తన సుహృదాశయాలను, దివ్యస్వప్నాలను పునరుజ్జీవింప చేసుకునేవాడు. ఆయన యువకులనుంచి గ్రహించింది: ఉద్రేకం! తను యువకులకిచ్చింది: సందేశం!

## స్వాతంత్ర్య జ్వాలను వెలిగించాడు

ఆయన జీవితంలోని అనేక దశలలో, నా చిన్నతనంనుంచీ ఆయనను గురించి నేనెరుగుదును. నేను హైద్రాబాదులో బాలికనై వున్నప్పుడు ఒకొక్కప్పుడు మా అమ్మ పాటలు పాడుతూవుండేది. ఆ పాటలు రవీంద్రనాథ టాగూరువని చెప్పేది "రవీంద్రుడు బెంగాల్ దేశానికి దేవుడులాంటివాడు" అనేది ఆమె. బెంగాల్‌లో స్త్రీ పురుషులంతా ఈగీతాలు పాడుతారు; అనేది ఆమె. పరంగులు, రైతులు, విద్యార్థులు గృహిణులు, ఉద్యోగులు - ఒకటేమిటి పట్నవాసులు, పల్లీయులు అనే భేదంలేకుండా ఎవరి గొంతునుంచైనా ఆపాటలు వినిపించేవి. ప్రజలు సుఖ, దుఃఖాలలోనూ యీగీతాలు ఆలపించేవారు."

అంతేకాదు అతని జన్మభూమి కడగండ్లకు లోనైనప్పుడు, భారతదేశంబానిస శృంఖలాలు ఛేదించుకునే స్వాతంత్ర్యపు దివ్యస్వప్నాలను కంటున్నప్పుడు ఆ స్వాతంత్ర్య జ్వాలను నిరాఘాటంగా పైకెత్తేవాడు. ఆజ్వాలనుంచి అన్ని హృదయాలూ వెలుగందుకునేవి.

## శాంతి సందేశం ఆయన గానం

ఆయన అనేక సార్లు యూరోప్ వెళ్ళాడు. ఆయన 1913 వ సంవత్సరంలో మూడవ సారి 'గీతాంజలి' తో వెళ్ళినప్పుడు, ఐరిష్ మహాకవి ఈట్స్, టాగూరు కవిత్వమహత్వానికి తన్మయుడై ప్రపంచానికి ప్రకటించినప్పుడు, ఆ యన ఔన్నత్యానికి యూరప్ ఎలా సంచలించిందో నాకు తెలుసు. రేపో మాపో రానున్న యుద్ధ జ్వాలల్లో మాల్లుతున్న యూరప్ ఖండం 'గీతాంజలి' శాంతి సందేశంకోసం తహతహలాడింది యూరోప్ నాల్గు చెరగులకూ టాగూరు కీర్తి జ్యోతిలాగ, పతాకలాగ వ్యాపించింది. ఒక కొత్త జీవితంకోసం, కొత్త ఆదేశం, కొత్త ఆశయంకోసం యూరప్ ప్రజలు టాగూరు కేసి చూశారు. సందేహ, భయాలతో వికలమైనవారి హృదయాలు ఆయన భవిష్యద్వాణిని ఆరాధించాయి.

'గీతాంజలిని' ప్రచురించినమరు సంవత్సరమే మొదటి ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. యుద్ధం ఎప్పుడు ప్రారంభమౌతుందాఅని భీతావహం చెందివున్న ప్రజలకు ధైర్యాన్నీ దార్ఢ్యాన్నీ ప్రసాదించటం అవసరమని రవీంద్రుడు భావించాడు. ఆసమయంలో, తనసందేశాన్ని ప్రజలకందించిన టాగూరు ఆబాలగోపాలాన్నీ సమ్మోహితులను చేశాడు. సాధారణంగా ప్రసిద్ధ విదేశీయులను ఎన్నడూ గౌరవించని ఇంగ్లీష్ జాతి టాగూరునుచూచి వెర్రెత్తిపోయింది. ఆ రోజుల్లో అనేక విచిత్ర సంఘటనలు జరిగాయి— ఆయన గీతాలను ఎక్కడపడితే అక్కడ, పిన్నలు, పెద్దలు అంతా చదివేవారే. కదులలో, విరామస్థలాల్లో; ఒక సారి బస్‌లో ప్రయాణంచేస్తుంటే ఒక యువకుడు అతివేగంగా నాదగ్గరికివచ్చి చేతులు రెండూ పట్టుకుని అన్నాడుకదా: "చూడు, చూడు; ఐదుగురు వృద్ధస్త్రీలు వరసగా గీతాంజలిని మననం చేస్తున్నారు" అని.

ఆయన స్కాండినేవియా, యుగోస్లావియా, జెకోస్లోవేకియా, హంగరీ, ఫ్రాంసు, జర్మనీ, అమెరికా, కనడా, దక్షిణఅమెరికా, మరి అనేక దేశాలు సంచారం చేసినప్పుడు ఒక నవదృక్పథాన్ని ప్రబోధించే మహాప్రవక్తగా వెలుగొందాడు.

**మానవజీవితానికి ఒక గాఢారాన్నీ, ఒక వున్నతలక్ష్యాన్నీ ప్రతిపాదించాడు. భారత దేశ విజ్ఞాన సంపదను దేశదేశాలకూ పంచిపెట్టాడు.**

## మానవత్వం వికసించిన మహాకవి

అనేకమందిఆయన్ను 'మిస్టిక్' అంటారు. ఆయన 'మిస్టిక్' కావచ్చు. ఐతే, ఆయన 'మిస్టిక్' మాత్రమే కాదు. 'మానవత్వం' వికసించిన మహాకవికూడాను! ఆయన పసిపిల్లలతో పిల్లవాడుగానే ఆడుకునేవాడు. అందరి కవులవలెనే ఆ యన సౌందర్యోపాసన చేసేవాడు. అంతేకాదు. వృద్ధుల ఎదుటకూచుని, గడ్డాన్ని మెల్లగా దువ్వుకుంటూ చావు, పుట్టుకలనుగురించీ

పునర్జన్మ, పునర్మరణమూ—అన్నిటినిగురించి తపస్విలాగ అనంతసత్యాలు బోధించేవాడు.

ఆయన ఎక్కడికి వెళ్ళినా చూసి మనుష్యులనేవాళ్ళుగదా! "ఏమి సుందరజ్యోతి జ్వాల దృక్పథం! నిస్సారమైన ఈ జగత్తులో ఈ సుందరమూర్తి ఏమిటి? ఆయన ప్రబోధకుడా ప్రవక్తా, మహర్షా?"

## విశ్వజనీనత ఆయన మహాత్వం

ఈ సందేహాలకు ఒక్కటే సమాధానం. ఆయన మూడూనూ - ఆయన గాయకుడు గనక! టాగూరులాంటి కవి కావడంకంటె ఉన్నతమైనదేముంది? అనేకమంది వేదాంతులు జన్మించారు, మరణించారు. వారు ప్రతిపాదించిన తత్వాలు పెరిగాయి, మరుగున పడిపోయాయి. మహారాజులనేకులు వచ్చారు, పోయారు. వారి పేర్లూ, వంశాలూ ఎవరికి జ్ఞాపకమున్నాయి? తమ కీర్తిదిగ్దిగంతాలకు వ్యాపించిన సైన్యాధిపతులు ఇవాళ ఎవరిక్కావాలి? కాని, మహాకవి ఎప్పుడూ బ్రతికే వుంటాడు. నేడు, రేపు అనకుండా, ఇక్కడా అక్కడా అనకుండా రవీంద్రుడు జీవించే వుంటాడు. తన దేశాన్ని ప్రేమించిన టాగూరు, ఇతర దేశాలనుగూడ సమానంగా గౌరవించాడు. ఆయన ప్రతినాళంలోనూ, పండిన ఆయన ప్రతి కేశంలోనూ, జీవంతో వెలిగే ఆయన ప్రతి రక్తకణంలోనూ - అంతటా ఆయన భారతీయుడే, కాని, ఆయనలో అంతటా విశ్వజనీనత గూడుకట్టివుంది.

ప్రపంచంలోవున్న విజ్ఞానాన్ని, శాస్త్రాన్ని, సౌందర్యాన్ని గ్రహించి తనలో ఇముడ్చుకోవడంలో విశ్వజనీనతను ప్రదర్శిస్తున్న భారతదేశం ఆయనలో తన అంతఃకరణకు సరియైన మూర్తిని కనుగొన్నది. భారత హృదయంతో పలికిన ప్రవక్త టాగూరు.

*　　*　　*

టాగూరు తనకు రానున్న మరణాన్ని సంబోధిస్తూ జీవితాన్ని గురించి యిలా చెప్పాడు:

"పుష్పించిన కమలంలో జాలువారే తేనెను ఆస్వాదించాను." ఈ కమలం పుష్పించిన తన మేధస్సు! ఈ తేనె తన జిహ్వాపై వర్షిస్తూనే ఆయన పరమపదించాడు.

---

ప్రజాసేవకులను గౌరవించలేని ప్రభుత్వం పతనంచెందక తప్పదు

—రవీంద్రుని లేఖలనుంచి

# పాదధూళి

★ నాటిక ★

శ్రీ పొట్లపల్లి రామారావు

## — మొదటి రంగము —

ఊరిబయట గుడిసె. గుడిసెమధ్య ఓ తడిక అడ్డంకట్టి ఉంటుంది. ముందు వసారాలోంచి తల్లి లోనికి పోతుంది. తల్లి ఓ చినుగుగుడ్డ కట్టుకొని ఉంటుంది. ఎప్పుడో, సిరులనుభవించినట్టు ఆమెమోము గంభీరంగా ఉంటుంది.

తొమ్మిదేళ్ళ పిల్లవాడు పడుకొని నిద్రపోతూవుంటాడు. పట్టుదలగల ముఖంలా కనపడుతుంది.

ఉదయం ఏడుగంటల వేళ

తల్లి: నాయనా!

[పిల్లవాడు కదలడు]

తల్లి: అబ్బాయి!

[జవాబివ్వడు]

తల్లి: నాయనా! లేరా!

[చెంపను చేయివుంచి కదిలిస్తుంది]

పిల్లవాడు: ఏమిటమ్మా?

[పడుకునే కసురుతాడు]

> 1942 మహోద్యమము నాటిది ఈ ఘటన. అస్సాం పల్లె ప్రాంతంలో ఒక ఇంటిని నిలువున దోచుకున్నారు పోలీసులు. గాంధీజీ ఆ ప్రాంతాల్లో సంచారం చేసినప్పుడు ఆకుటుంబంలో మిగిలిన తల్లి, పిల్లవాడు, వాళ్ళ విషాద జీవితం బయటకొచ్చింది. మఖ్ఖన్‌లాల్, దులారిరామ్ నాటికలో కల్పిత వ్యక్తులే ఐనా ఇలాంటి నేర్పరులు మనరాజకీయ రంగంలో చాలమంది ప్రవేశించారు.

తల్లి: తెల్లవారిందిరా!

పిల్లవాడు: తెల్లవారితే యేం నిద్రపోనీయవ్వూ—

తల్లి: అయ్యో — మాటచెపుతా!

పిల్లవాడు: ఏమిటమ్మ మాట! నిద్రపోయి లేవనీయ్.

తల్లి: అయ్యో!... నాయనా

[నిరాశగా అంటుంది]

పిల్లవాడు: నిద్రపోనీయక 'నాయనా... నాయనా'

తల్లి: ఒక్కమాటవిని పడుకోరాదురా.

పిల్లవాడు: ఊహు...

తల్లి : అయ్యో...
పిల్లవాడు : నన్ను పడుకోనియ్యవూ,
[కోపంతో]
తల్లి : యింతకోపమైతే ఎట్లాగురా ?
పిల్లవాడు : నిద్రపోనీయక కోపము...
తల్లి : ఈ రోజు యిక్కడికి...
పిల్లవాడు : సరే...పో
తల్లి : చూడు ?
పిల్లవాడు : నీ పుణ్యముంటుంది అమ్మా కొంచెం పడుకోనీయి.
తల్లి : ఇదెక్కడి నిద్ర రా ... మొద్దునిద్ర! ఊరంతా మేల్కొంది...ఇదంతా ఏమిటో కొంచెంలేచిచూడు !
పిల్లవాడు : చాల్లే...పో !
తల్లి : బాపూజీ వస్తారునాయనా ! ఈ రోజు మనవూరు !
[పిల్లవాడు కొంచెంసేపు
చకితుడై లేస్తాడు]
పిల్లవాడు : బాపూజీ ?
తల్లి : అవును నాయనా! ఏమనుకున్నావు!
పిల్లవాడు : యిక్కడికా ?
తల్లి : అవును యిక్కడికి. మనగ్రామానికి మనలోగిళ్ళలోకి...మనమధ్యకు.
పిల్లవాడు : మనయింటికిగూడానా అమ్మా!
తల్లి : మనయింటికానాయనా ! శుద్ద దరిద్రులం ... దొంగలుపడ్డ యిల్లు మనది. మనల్ని ఎవరడుగుతారు నాయనా ! ఆ మహాత్ముడికి అర్పించ డానికి మనచేతిలో ఏముంది చెప్పు ! పోనీ ఆ మహానుభావునికి మనం ఏం తెలుసు !
పిల్లవాడు : దేశంకోసం అన్నీ అర్పణచేసిన మనబోటివాళ్ళను విడిచి, సేట్ దులారి రామ్, ముఖన్‌లాల్ యింటికి వెళతా డమ్మా బాపూ ?
తల్లి : మనత్యాగాలు ఒకలెక్కలోనివా నాయనా ! మఖన్ లాల్ వాళ్ళేగా ఈ ఊరికి నాయకులు. ఈ రోజుచూడు పెట్టెల్లో దాచివుంచిన ఖాదీబట్టలు వేసుకొని మహాత్ముల్లాగా ఊరంతా ఎంత తాపత్రయంతో తిరుగుతున్నారో...పందిళ్లు! పాకలు ! ద్వారాలు ! తోరణాలు !...
పిల్లవాడు : బాపూను పూనాజైల్లో పెట్టినప్పుడు వీళ్ళేకాదమ్మా అధికారులకు ఆశ్రయమిచ్చి మనయిళ్ళు దోయించింది ?
తల్లి : అవునునాయనా ! కాని ఆబాపూకు ఏం తెలుసు ఈ తెరచాటు సంగతులు! వీళ్ళగౌరవం మర్యాద, మాట, మన్నన, భయం, భక్తి, ఎవళ్ళకొస్తాయి. ఈ రోజు వీళ్ళు పూనుకోకపోతే బాపూను ఆహ్వానించేది ఎవరు ? పోగా వాళ్ళను కాదని ఆ మహానుభావుడిదగ్గరికిపోయి ఈసంగతులుచెప్పేవా రెవరు ?
పిల్లవాడు : బాపూ బీదవాళ్ళతోనే వుంటాడుగాఅమ్మా ! ఏం! మన యింట్లో ఎందుకుదిగకూడదు ?
తల్లి : మంయిల్లా నాయనా ! ఆయన పాద ధూళి దొరికినాచాలు మనకు.
పిల్లవాడు : పాదధూళా అమ్మ! బాపూనే ఆహ్వానిద్దామమ్మా మన యింటికి!
తల్లి : నీమాట ఎవరువింటారు నాయనా దులారిరామ్, మఖన్‌లాల్, వాళ్ళ మాటే చెల్లుబడి అవుతుంది.

పిల్లవాడు : వీళ్ళు వినకపోతేమానె..బాపు వినడమ్మా ?

తల్లి : ఆయన దగ్గరికెవరు పోనిస్తారమ్మా నిన్ను ?

పిల్లవాడు : నేనే పోతాను...దులారీరామ్ మఖన్‌లాల్ వాళ్ళంతా పోయినట్టే నేనూ పోతాను.

తల్లి : లాఠీలు తీసుకొని ఆయనచుట్టూ మన సాహుకారు అనుచరులంతా నిలబడుతారు. పోయినా నిన్ను నెట్టివేస్తారు ఈ అవమానమెందుకుబాబూ!

పిల్లవాడు : ఇప్పుడు మనకున్న గౌరవమేమిటమ్మా ? అయినా బాపుదర్శనంకోసం పోయినపుడు ఎవరైనా నెట్టివేస్తే దానిని లెక్క చేయకూడదమ్మా.

తల్లి : నాయనా...తండ్రిలేని పిల్లవాడివి. చూడు! పైగా ఆ సాహుకారు మనపై ఏమంత యిదిగా లేడు.

పిల్లవాడు : వాళ్ళతో నాకేమి అక్కరమ్మా! బాపూతో నాకుపని.

తల్లి : బాపూను ఏమనుకున్నావు నాయనా! రాజాధిరాజులు ఆయనతో సంభాషించలేరు.

పిల్లవాడు : రాజాధిరాజులతో బాపూకు పనిలేదు. నిజమే ...కాని బాపు బీదలతో ముచ్చటపడతాడు. నవ్వుతాడు ఆడుకుంటాడు. ఆరోజున పత్రికలో నుంచి కత్తిరించిన బొమ్మేది? దాంట్లో బాపూ మాలి అబ్బాయిని ఎత్తుకొని నవ్వడంలేదా ?

తల్లి : నిజం ... నాయనా ... కాని...

పిల్లవాడు : పరవాలేదమ్మా! అన్నీ అనుమానాలు నీకు.

తల్లి : సాహసం ఎందుకు తండ్రీ...అందని పండ్లకు ఆశపడటం దేనికి ?

పిల్లవాడు : అందని పండు అయితే మన మధ్యకు ఎందుకొస్తాడు బాపు ?

తల్లి : మన సేట్ దులారీరామ్ వాళ్ళు పిలిచారు.

పిల్లవాడు : నీకు దులారీరామ్ పిచ్చి పట్టుకుంది ..వీడేనడమ్మా! వీడి కొంప పోయిందా ? గొడ్డుపోయిందా ? వీడు తుపాకులకు రొమ్మిచ్చి ఎదురు నిలబడ్డాడా ? మనబోటి ఆర్తుల, దీనుల, దుఃఖితుల చూడటానికి వస్తున్నాడమ్మా బాపూ. లేకపోతే ఈ సేట్ కన్న పెద్దబొజ్జ కలవాళ్ళు బాపూకు దొరకకపోరు

తల్లి : నాయనా! నీయిష్టం... నాకోరిక ఒకటిమాత్రం పూర్తిచేయి!

పిల్లవాడు : ఏమిటమ్మా ?

తల్లి : బాపూనుఎట్లాగూ నేను చూడలేను.. కొంచెం ఆయన పాదధూళి తెచ్చి పుణ్యం కట్టుకో నాయనా.

పిల్లవాడు : నీకు వెర్రిలేచిందేమే అమ్మా!

తల్లి : అవును నాయనా, వెర్రే. వెర్రి కాకపోతే ఇంకేముంది ? నిన్ను అన్ని విధాల పెంచి పెద్దజేసి విద్యాబుద్ధులు చెప్పవలసిన మీ నాన్నను పోగొట్టుకున్నాను. నిన్ను మరిపించే నీ ఎత్తు కొడుకును దేవుడు ఎత్తుకుపోయాడు, ఆస్తిని దొంగలు దోచుకుపోయారు. కొంప బూడిద అయింది. యిక వెర్రి లేక ఏమౌతుంది ?

పిల్లవాడు : అమ్మా... ఊరుకో ... నేను బాపూకు ఇవన్నీ చెపుతాను.

తల్లి : నిజమే... నాయనా... బాపు!

పిల్లవాడు : మనబోటి నీడలేని వాళ్ళందరికీ తండ్రి, బాపు.

తల్లి : నిజము ... నాయనా ... నీకన్నీ వయసుకుమించిన ఆలోచనలే... పెరిగి పెద్దయి నాలుగు కాలాలపాటు చల్లగా బ్రతికాలె.

పిల్లవాడు : ఇక మనం బాగానే బ్రతుకు తాము!

తల్లి : నీ మాటలు విని నాకు ధైర్యం వేస్తుంది మీ నాన్న యింతే. ఎంత సంకటాల్లోఉన్నా యిట్లాగే మాట్లాడే వాడు.

పిల్లవాడు : అమ్మా! నీమీద కినిసాను నిద్రలేపావని,

తల్లి : పర్వాలేదు తండ్రీ,

పిల్లవాడు : నాకు మొదట చెప్పలేకేం?

తల్లి : నిద్రపోయేవాళ్లు అట్టాగే చేస్తారులే.

పిల్లవాడు : అమ్మా నేను బయటికి పోతా.

తల్లి : నాలుగు బియ్యపుగింజలు వేస్తాను. ఒకముద్ద నోట్లోవేసుకొని వెళ్లుతండ్రి.

పిల్లవాడు : ఇవాళ నాకు ఆకలి అని పించడం లేదమ్మా.

తల్లి : మళ్ళీ ఎంత పొద్దుపోతుందో.

పిల్లవాడు : పోనీ...ఆకలి లేనిది...!

తల్లి : పోయిరా బాబూ! కాని బాపు పాదధూళి మరువకు తండ్రీ.

పిల్లవాడు : పిరిదానివి......అంత మతి మరపు వాడినా అమ్మా నేను!

తల్లి : బైట సందడిలోపడితే యేమో నాయనా!

## — రెండో రంగం —

ఊరు ఉత్సాహ తరంగితమై ఉంటుంది. ఊరిజనం ఊరిబయట బాపుకోసం గుమిగూడి వుంటారు. స్వచ్ఛమైన ఖాదీదుస్తులు ధరించిన స్వయంసేవకులు జనాన్ని సర్దు తుంటారు. దులారీరామ్, మఖన్ లాల్ సన్మానపు పందిటిలో పూల మాలల్ని అలంకరిస్తూంటారు. ఇంతలో 'బాపూ, బాపూ' అని కేకలు వినిపిస్తాయి. జనసమూహం అంతా ఓ కెరటంలాగ లేచి ఊళ్ళోకి వస్తున్న మోటారుపై పడతారు. బాపు మోటారులో నుండి చిరకాలపు మిత్రులమధ్యకు వచ్చినట్టు బోసినవ్వులతో, భాస్వంతమైన తేజంతో, జన సమూహంలోనుంచి దారి చేసు కొని బయటికి వస్తాడు. మఖన్ లాల్ మొదలైనవాళ్ళు దండలు వేసారు. ప్రజలు "మహాత్మా గాంధీకీ జై" అంటూ ఆహ్వానిస్తారు. బాపూ తొణకడు. నవ్వుతుం టాడు. పిల్లవాడు జనసమూహం కోలాహలానికి, తొందరపాటుకు ఉక్కిరిబిక్కిరి అవుతూ బాపూను చేరడానికి తాపత్రయపడుతుంటాడు.

బాపు : [illegible] ఇక్కడే [illegible]

శంకర్ లాల్ : అవును. బాపూజీ ఇక్కడే [illegible] ...రోజంతా [illegible]... కాదు రాదు...ఆ దృశ్యం [illegible]...

బాపు : నడవండి !

(బాపు ముందు ఆయన వెనక జనసమూహం నడుస్తుంటారు. పిల్లవానికి జనంలో నుంచి ముందుకు సందు దొరకదు)

పిల్లవాడు : 'నన్ను కొంచెం ముందుకు పోనీయండి'

ఒక నాయకుడు : ఎవడు వీడు ?

(పిల్లవాడు వినిపించుకోడు.)

రెండో నాయకుడు : అరె ఎక్కడికి ?

ఒక నాయకుడు : ముందు యేమున్నదని పోతున్నావ్ ?

(పిల్లవాణ్ణి వెనకకు నెట్టేస్తారు. పిల్లవాడు మళ్ళీ ముందుకు పోతాడు)

రెండో నాయకుడు : అరె.........యేమి చేస్తావురా ?

(చేయిపట్టి ఆపుతాడు)

ఒక నాయకుడు : నెట్టేయండి !

(పిల్లవాడు వినిపించుకోకుండా జనంలో నుంచి ముందుకుపోయి బాపు పాద ధూళి అందుకోబోతాడు)

రెండో నాయకుడు : అరేయ్ ! వెనక్కురా !

ఒక నాయకుడు : తోసేయండి !...ఎవడు వీడు ?

రెండో నాయకుడు : చచ్చిపోతావు ! వెనక్కు పోవేంరా !

(రెండో నాయకుడు కుర్రవాణ్ణి లాగి వెనక్కు తీసుకుపోతాడు. కుర్రవాడు [illegible] అడుగులు చూస్తూ సమూహం [illegible] తోచగానే ముందుకు [illegible] బోతాడు)

ఒక నాయకుడు : 'అరే వీడు [illegible] ఎవడో వీడు !'

రెండో నాయకుడు : ఏమిరా [illegible] నీకు కాదురా చెప్పేది !

ఒక నాయకుడు : అరే తొక్కు[illegible] న్నా(రా !...వీడు చస్తాడు.

రెండో నాయకుడు : తొక్కి [illegible] చేయో, కాలో విరిగితే కాని [illegible] రాదు.

(జనసమూహం కాళ్ళ క్రిందనుండి ఎట్లాగో నలిగిన చేయి బయటకి తీసుకుంటాడు)

ఒక నాయకుడు : మంచి పనయింది. [illegible] బుద్ధి వచ్చిందా ?

రెండో నాయకుడు : ఇక వెళ్ళు [illegible] చెయ్యి విరిగిపోతే ముక్కలైపోతుంది !

ఒక నాయకుడు : [illegible] తొక్కడంలో నుసి అవుతావ్

(పిల్లవాడు ఇవేమీ వినిపించుకోక బాపు కాళ్ళు చూస్తూ నడుస్తుంటాడు. బాపు వెనక కొంచెం మేర ఖాళీ ఏర్పడుతుంది. పిల్లవాడు వెంటనే బాపు పాదాల గుర్తులపై పడతాడు)

ఒక నాయకుడు : అరేయ్ ! కాళ్ళలో పడ్డాడు వెధవ !

రెండో నాయకుడు : మళ్ళీ చేరాడు ? [illegible] అరేయ్ ! నా కాలు చేయిమీద పడ్డా లే...లే.

ఒక నాయకుడు : చావనీయి వెధవని.

రెండో నాయకుడు : అవునండి ..అవునండి - కాస్త మాడండి, కుర్రవాడు !

ఒకనాయకుడు : చచ్చిపోతాడు.

పిల్లవాడు : (ఊపిరి తిరగదు) బాపూ ! బాపూ !

బాపు : ఎవరు ?

మఖన్‌లాల్ : ఎవడో కుర్రవాడు జనం మధ్యను వచ్చినట్టున్నాడు.

[పిల్లవాడు 'బాపూ' అనిమూల్గుతుంటాడు]

బాపు : తొక్కి వేసినారు ? ఏది ? ఎవరు ?

మఖన్‌లాల్ : బాపు ! తాము ఉండండి నేను పోయివస్తాను

బాపు : అక్కరలేదు... నేను పోతాను.
[జనసమూహం మధ్యను పోతారు]

బాపు : ఎవరు ?

దులారిరామ్ : ఎవడో యిక్కడవాడే (మఖన్‌లాల్‌తో మెల్లగా) శ్యామ్ కొడుకు.

మఖన్‌లాల్ : వాడికేంపని ఇక్కడ ?

బాపు : ఏడి ? (బాపు పిల్లవాని దగ్గరికి పోతాడు మనుషుల పాదాలు పడడం వలన పిల్లవాడి చేతులు నలిగి రక్తం కారుతుంది. శరీరం ధూళితోను నిండ ఉంటుంది. పిల్లవాడికి స్పృహతప్పి పోతుంది)

బాపు : చంపారా ?

సుశీలనాయర్ : లేదండి ... కొంచెం పొట్టను ఎక్కడో దెబ్బతగిలినట్టుంది.

బాపు : అదేమిటి ? చేతులు చితక తొక్కారు ! మెల్లగా రాకూడదూ!

సుశీలనాయర్ : వేళ్ళు కొంచెం నలిగాయండి.

బాపు : కొంచెమేమిటి ! రక్తం కారుతుంటే,

(పిల్లవాడు కళ్ళు కొద్దిగా తెరుస్తాడు. హఠాత్తుగా బాపు ఎదుట కనిపించేసరికి పిల్లవాడు పోయిన ప్రాణాలు వచ్చినట్టు లేవబోతాడు)

బాపు : ఎక్కడికి లేస్తావు !

పిల్లవాడు : బాపూజీ !

బాపు : ఏమబ్బాయి ? ఉండు కొంచెం కూర్చో !

పిల్లవాడు : (లేస్తాడు) నమస్తే, బాపూజీ!

బాపు : (నమస్తే అంటాడు) జాగ్రత్తగా నడవాలబ్బాయ్ !

పిల్లవాడు : క్షమించండి బాపూ ! మీరు కొంచెం అటు జరుగుతారా ?

బాపు : ఎందుకు ? ఏమైనా పోగొట్టుకున్నావా ?

(బాపూ రెండడుగులు వెనకకు వేస్తాడు పిల్లవాడు వంగి ఆయన పాదధూళి చొక్కాలోకి తీసుకుంటాడు)

బాపు : యిదేమిటబ్బాయ్ ?

పిల్లవాడు : అయిపోయింది బాపూ !

బాపు : దీనికోసమే జనం కాళ్ళక్రింద పడ్డావా ?

పిల్లవాడు : లేదు బాపూ !

బాపు : వేళ్ళు రక్తం కారుతున్నాయి. కట్టు వేసుకోముందు.

పిల్లవాడు : రక్తం యిక కారదుబాపూ! అయిపోయింది

బాపు : గాయంలో మట్టి చేరుతుంది.

పిల్లవాడు : మట్టి అంటితె ఊరకే మాని పోతుంది బాపు.

బాపు : యిప్పుడు తెలివి తప్పినట్లుంటివే?

పిల్లవాడు : మీ మాట వినగానే తెలివి వచ్చిందిబాపూ.

బాపు : సుశీలాజీ ! అబ్బాయిని కొంచెం చూడు. వ్రేళ్లు చితికిపోయినయ్ !

సుశీలాజీ : మంచిది బాపూ.

బాపు : అబ్బాయీ ! మీది ఏగ్రామం ?

మఖన్‌లాల్ : ఈ గ్రామమే నండి.

ఒకడు : ఇతని తండ్రినే కాల్చారండి పోలీసులు.

బాపు : ఏ మబ్బాయ్ ?

పిల్లవాడు : అవును బాపూ !

బాపు : అబ్బాయ్ ! నాతోరా; కట్టు కట్టుకొని పోదువు.

(అబ్బాయి నలిగిన చేయిపట్టుకొని నడుస్తుంటాడు)

బాపు : ఎవరున్నారబ్బాయి నీకిప్పుడు ?

పిల్లవాడు : అమ్మ వుంది.

బాపు : నీవొకడవేనా !

పిల్లవాడు : అన్నయ్యను కాల్చారండి

బాపు : రక్తంముక్కలు పడుతున్నాయి చూడు ! త్వరగా నడు ! అన్నను కాల్చాడుకదు ?

పిల్లవాడు : నయమైపోతుందండి ఇప్పుడు.

ఒకడు : అంతేకాదండి. ఇల్లు తగుల బెట్టారండి.

బాపు : ఇల్లుకూడా ! యెక్కడవున్నా రబ్బాయ్ ! ఇప్పుడు ?

పిల్లవాడు : ఊళ్లోనేనండి

బాపు : అదికాదు. ఇల్లుపోయింది కదా, యెక్కడ వుంటున్నారు ?

పిల్లవాడు : ఊరిబయట పాక వేసుకున్నా మండి.

(ఇంతలో సేటుబాబు రెండు అంతస్థుల మేడవస్తుంది. బాపు ఆ యింటివంక ఓచూపుచూచి తలవాల్చుకుంటాడు)

బాపు : సేట్ సాబూ ! వీళ్ళు వూరి బయట వున్నారా ?

మఖన్‌లాల్ : అవునండి......యెంతో చెప్పాను ఊళ్ళో వుండమని. నాగది ఒకటి చూపించాను.

బాపు : ఏ మబ్బాయ్ ?

పిల్లవాడు : అవునండి. వారికే యిరుగ్గా వుందని బయట పాక వేసుకున్నామండి.

బాపు : ఇరుకా !

(భవనంవంక మరొకసారి చూస్తాడు)

మఖన్‌లాల్ : తమకిక్కడే బస.

బాపు : అబ్బాయ్ ! మీపాక ఎక్కడ ?

పిల్లవాడు : ఊరిబయట బాపూ.

బాపు : సేట్ సాబ్ ! నేను ప్రస్తుతానికి అబ్బాయి పాకలోనే బసచేస్తాను. నీ ఇంట్లో దిగనందుకు క్షమించు.

మఖన్‌లాల్ : బాపూ ! బాపూ !

బాపు : అబ్బాయ్ ! నడవమ్మా

పిల్లవాడు : బాబూ ! సేట్ సాబ్ చాల శ్రమపడ్డాడు.

బాపు : నీకెందుకది ?

పిల్లవాడు : మాయింట్లో ఎట్లావుండగలవు బాపు ? కూచోన చింకిచాపైనా లేదే.

బాపు : నాకు తెలుసు. ఎక్కడెట్లా వుండాలో.

మఖన్‌లాల్ : మాఅపరాధాన్ని క్షమించండి

బాపు : నీ అపరాధ మేముంది! వెర్రివాడ!

సుశీలనాయర్ : అబ్బాయ్ ! నీచేతికి కట్టు వేసుకో మొదట.

బాపు : అవును... వెళ్ళు !

పిల్లవాడు : పోతున్నా బాపూ.

— మూడో రంగం —

గుడిసెలో పిల్లవాడితల్లీ, మరో స్త్రీ మాట్లాడుకుంటుంటారు. వాళ్ళిద్దరి గొంతులు సంతోషంతో ఉప్పొంగుతుంటాయి.

స్త్రీ: అమ్మా! ఊరంతా సేట్ సాబ్ యింటిముందు మూగివుంది.

తల్లి: ఏమి భాగ్యమమ్మా! నాకు కళ్ళతో చూచే అదృష్టంలేదు.

స్త్రీ: అంతటి మహానుభావుడు మన ఊళ్లో కాలుపెట్టాడంటే అదిమన అదృష్టమే.

తల్లి: ఎన్నడో మన గ్రామం చేసుకున్న పుణ్యం!

స్త్రీ: కాని యీ పాడుజనం యెవరో ఓ కుర్రవాణ్ణి తొక్కివేశారట.

తల్లి: అయ్యో! మా పిల్లవాణ్ణి కదుగదా?

స్త్రీ: ఏమోనమ్మ! తెలివి తప్పిపోయిందన్నారు.

తల్లి: వీళ్ళకెందుకు మతులేవు నెత్తిన కళ్ళుపెట్టుకొని పోతారా?

స్త్రీ: ఒక్కడికీ తనువుమీద స్పృహ వుంటేనా! అంతా వెర్రియెత్తినట్టు ఊరికారు.

తల్లి: ఏమిటో తల్లీ! నాకు భయం వేస్తూంది. అందరిని పోగొట్టుకొని ఒక్కణ్ణి మిగుల్చుకున్నాను. వాడి బ్రతుకు అందరికీ కంటకంగా వుంది

స్త్రీ: అబ్బో! మీ కుర్రవాడు అంత అజాగ్రతగా పోయేవాడు కాదమ్మా.

తల్లి: ఏమోనమ్మ, ఇంకారాలేదుచూడు!

స్త్రీ: యివాళ ఎవరికీ తిండిమీద ధ్యాస లేదు.

తల్లి: మావాడు నోట్లో నీళ్ళుకూడా పోసుకోలేదు

స్త్రీ: ఊరివాళ్ళు మాత్రం! తిండి తిప్పలు మతికిరాకుండా చిరునవ్వుతో మంత్రం చేసినట్లు వున్నాడాయన

తల్లి: యింట్లో కూర్చున్నా పనిమీద రాదూ! నాలుగు మెతుకులు నంజుదామంటే, ఎందుకో నాకు ఆకలే లేకుండా పోయింది నామనసు ఎక్కడో ఉంది.

స్త్రీ: అదిగో, ఆ కోలాహలం యిటే వినబడుతున్నది.

తల్లి: పిల్లవాణ్ణి జ్ఞాపకం చేసుకుంటే నా మనసు, మనసులో ఉండడంలేదు. నీ వేదో చెప్పితివే!

స్త్రీ: ఎందరు పిల్లలు లేరమ్మా!

తల్లి: ఏమోనమ్మ వాడువచ్చేవరకు నాకు, (ఇంతలో 'అమ్మా', 'అమ్మా...' అని కుర్రవాడు పరుగెత్తుకు వస్తాడు)

తల్లి: వచ్చావు నాయనా!

స్త్రీ: ఇదుగోనమ్మ నీ కొడుకు.

పిల్లవాడు: ఏమిటమ్మ!...వచ్చాను.

తల్లి: ఏమి నాయనా, ఏమి చేశావు?

పిల్లవాడు: ఏమిటమ్మా?

తల్లి: అయ్యో, నాయనా - పాదధూళి?

పిల్లవాడు: క్షణమాగమ్మా!

తల్లి: ఏమిటి నాయనా?

పిల్లవాడు: నిమిషమైతే మన యిల్లంతా ఆ ఘన పాదధూళి నిండుతుంది.

తల్లి: ఇదేమిటి నాయనా?

పిల్లవాడు: బాపు వస్తున్నాడమ్మా మన యింటికి.

తల్లి : బాపూ? నాయనా! అయ్యో! మన యింటికి? విధీ! ఆయన ఎదురుగా ఎట్లాపోను!

పిల్లవాడు : ఏమిటమ్మా వెర్రి?

తల్లి : వెర్రినాయనా! చినుగుగుడ్డతో ఎట్లాపోను ఆ మన ఎదటికి?

పిల్లవాడు : అదిగో! యింటిముందుకు వచ్చారు.

తల్లి : అయ్యో! విధీ! నాయనా! ఆ చేతి కేమిటి? నేను చూడనేలేను!

పిల్లవాడు : ఏమీలేదమ్మా, గడపలోకి వచ్చారు.

(గడప వాకిలినుంచి వసారా లోనికి ఉరికి, బాపూముందు చేతులు మోడ్చి నిలవబడతాడు.)

బాపు : అబ్బాయ్! మీ అమ్మఏది?

పిల్లవాడు : వెంటనే చాప పరుస్తాడు

పిల్లవాడు : ఉంది బాపూజీ.

బాపు : కనపడదేమి?

పిల్లవాడు : లోన ఉంది.

బాపు : ఏమీ? బయటికి రాదూ?

(పిల్లవాడి కళ్లలోకి నీరు వస్తుంది)

బాపు : ఏమబ్బాయీ?

పిల్లవాడు : అమ్మ యిక్కడికి రాలేను బాపూజీ!

బాపు : ఘోషా అబ్బాయ్ మీరు?

పిల్లవాడు : కాదండి

బాపు : మరి ఏమిటి?

చెప్పడానికి సంశయిస్తాడు)

బాపు : చెప్పునాయనా!

పిల్లవాడు : పైన గుడ్డ లేదండి!

బాపు : గుడ్డలేదూ! ఇదిగో నావంటిపైది.

పిల్లవాడు : వద్దు బాపూ

బాపు : తీసుకపో అబ్బాయ్!

(పిల్లవాడు అంగవస్త్రం తీసుకొని లోనికి పోతాడు. బాపు మౌనముద్రాంకితుడై గంభీరమైన ఆలోచనతో నిలబడి పోతాడు. ఆ మర్మాంతిక ఆవేదనను అనుభవిస్తున్న ప్రజలు నిశ్శబ్దంగా నిలబడుతారు. ఇంతలో అంగవస్త్రం చుట్టుకొని సంతోషంతో వణుకుతూవచ్చి బాపు పాదాలపై పడుతుంది తల్లి)

బాపు : అమ్మా!... లే, అమ్మా!

(తల్లి ఏడుస్తుంది)

బాపు : పరవాలేదు ఇవాళ నీ దర్శనమైనందుకు ఎంతో గర్వపడుతున్నా.

తల్లి : ఎందుకుబాపూ పాపురాలిని?

బాపు : అట్లా అనుకోవద్దు... నీవంటి వీరమాతల వీరపత్నులచూచి దేశం గర్వపడాలి.

[బాపు సేట్ వంక ఓచూపు చూస్తాడు సేట్ ఆ చూపును తాళలేక బాపూ కాళ్ల మీద బోరగిలబడుతాడు.]

ముఖన్‌లాల్ : నా తప్పు మన్నించండి బాపూ! మీ ఆత్మను తెలుసుకోలేను.

బాపు : నా ఆత్మా! (నవ్వుతాడు) ఇకరా అబ్బాయ్ కట్టుఏది? (చూస్తాడు) నయమైపోతుంది పరవాలేదు.

పిల్లవాడు : ఎప్పుడో పోయిందిబాపూ.

బాపు : చాలగట్టివాడు!

మఖన్‌లాల్ : నిజంబాపూ!

బాపు : వృద్ధిలోకి వస్తాడీపుత్రవాడు!

తల్లి : మీదయ!

మనంచేసే ప్రతిపనికీ వారి యెదుట మనం సమాధానం చెప్పుకోవాలి అన్నట్లు పసిపాపలను చిత్రించాలి!

ప్రజారచయిత ఎప్పుడూ పాఠకులకు జీవితంతో గాఢతరమైన సంబంధం కలిగేలాగ, వారి స్వశక్తి మీద దృఢవిశ్వాసం కలిగేలాగ తనరచనలో ప్రయత్నం చెయ్యాలి. జీవితంలోని మహత్తర సత్యాన్ని గ్రహించడానికి, శ్రమించడంలో వున్న అత్యధిక ప్రాముఖ్యాన్ని, ఆనందాన్ని గుర్తించటానికి అడ్డు వచ్చే బాహ్యాంతరంగిక పరిస్థితులపై నిరంతర పోరాటం జరిపే ధైర్యాన్ని, విశ్వాసాన్ని కలిగించాలి!

ఇవీ — సంక్షిప్తంగా — శ్రామిక జగత్తుకవసరమైన రచయితకు ప్రధాన లక్షణాలు.

## రచయితల కర్తవ్యాలు

గోర్కీ మరొక సందర్భంలో తనకు లేఖ వ్రాస్తూ ఇలా అన్నాడు:

మీరు టెక్నిక్‌ను జాగ్రత్తగా అలవరచుకోవాలి. టెక్నిక్ తెలియకుండా చెప్పులు కుట్టేవాడుకూడా చర్మాన్ని సాఫీచెయ్యలేడు. పూరా సాహిత్యాన్ని పూర్తిగా మననం చెయ్యండి... సత్యమూ, నిరాడంబరత అనేవి అక్కా చెల్లెళ్ళ వంటివి! సౌందర్యం మూడవ సోదరి! ప్రతిరచన విషయంలోనూ దీర్ఘంగా శ్రమించాలి. మిమ్మల్ని మీరే నిర్దాక్షిణ్యంగా కృషికి బలి చేసుకోవాలి!...

బాల్యదశలోవున్న రష్యన్ సాహిత్యానికి మహత్తర కర్తవ్యం వుంది. పాతజీవితం ఎంతదుర్భరమో పరిపూర్ణంగా చిత్రించాలి. కొత్త జీవితాన్ని, కొత్త మనస్తత్వాన్ని సృష్టించటానికి దోహదం చెయ్యాలి. ప్రతి జీవితరంగంలోనూ ధైర్యంగా వీరోచితంగా కృషి చెయ్యటానికి, మానవ జీవితానికే కొత్తస్వరూపం ఇవ్వటానికి, ప్రజలకు ఉత్సాహమూ, ఉద్వేగమూ కలిగించాలి!

కళాకారునికి ప్రపంచమంతా ఇతివృత్తమే. కాని, కళాకారుడు ఎప్పుడూ వాస్తవ జగత్తుపైనా, తనపైనా అసంతృప్తి కలిగివుండాలి. గమనించండి — తనతోకూడా.

తల్లి : బాపూ? నాయనా! అయ్యో! మన యింటికి? విధీ! ఆయన ఎదురుగా ఎట్లాపోను,!

పిల్లవాడు : ఏమిటమ్మా వెర్రి?

తల్లి : వెర్రినాయనా! చినుగుగుడ్డతో ఎట్లాపోను ఆయన ఎదటికి?

పిల్లవాడు : అదిగో! యింటి ముందుకు వచ్చారు.

తల్లి : అయ్యో! విధీ! నాయనా! ఆ చేతి కేమిటి? నేను చూడనేలేను!

పిల్లవాడు : ఏమీలేదమ్మా, గడపలోకి వచ్చారు.

(గడప వాకిలినుంచి వసారా లోనికి ఉరికి, బాపూముందు చేతులు మోడ్చి నిలవబడతాడు.)

బాపు : అబ్బాయ్! మీ అమ్మఏది?

పిల్లవాడు : వెంటనే చాప పరుస్తాడు

పిల్లవాడు : ఉంది బాపూజీ.

బాపు : కనపడదేమి?

పిల్లవాడు : లోన ఉంది.

బాపు : ఏమీ? బయటికి రాదూ?

(పిల్లవాడి కళ్లలోకి నీరు వస్తుంది)

బాపు : ఏమబ్బాయీ?

పిల్లవాడు : అమ్మ యిక్కడికి రాలేదు బాపూజీ!

బాపు : ఘోషా అబ్బాయ్ మీరు?

పిల్లవాడు : కాదండి

బాపు : మరి ఏమిటి?

చెప్పడానికి సంశయిస్తాడు)

బాపు : చెప్పునాయనా!

పిల్లవాడు : పైన గుడ్డ లేదండి!

బాపు : గుడ్డలేదూ! ఇదిగో నావంటిపైని.

పిల్లవాడు : వద్దు బాపూ

బాపు : తీసుకపో అబ్బాయ్!

(పిల్లవాడు అంగవస్త్రం తీసుకొని లోనికి పోతాడు. బాపు మౌనముద్రాంకితుడై గంభీరమైన ఆలోచనతో నిలబడి పోతాడు. ఆ మర్మాంతిక ఆవేదనను అనుభవిస్తున్న ప్రజలు నిశ్శబ్దంగా నిలబడుతారు. ఇంతలో అంగవస్త్రం చుట్టుకొని సంతోషంతో వణుకుతూవచ్చి బాపు పాదాలపై పడుతుంది తల్లి)

బాపు : అమ్మా!... లే, అమ్మా!

(తల్లి ఏడుస్తుంది)

బాపు : పగవాళ్ళేను ఇన్నాళ్ళ నీ దర్శనమైనందుకు ఎంతో గర్వపడుతున్నా.

తల్లి : ఎందుకుబాపూ పాపురాలిని ?

బాపు : అట్లా అనుకోవద్దు...నీవంటి వీరమాతల వీరపత్నులచూచి దేశం గర్వపడాలి.

[బాపు సేట్ వంక ఓమారు చూస్తాడు సేట్ ఆ చూపును తాళలేక బాపూ కాళ్ల మీద బోరగిలబడుతాడు.]

మఖన్‌లాల్ : నా తప్పు మన్నించండి బాపూ! మీ ఆత్మను తెలుసుకోలేను.

బాపు : నా ఆత్మా! (నవ్వుతాడు) ఇకరా అబ్బాయ్ కట్టుఏది? (చూస్తాడు) నయమైపోతుంది వరవాలేదు.

పిల్లవాడు : ఎప్పుడో పోయిందిబాపూ.

బాపు : గాలట్టివాడు!

మఖన్‌లాల్ : నిజంబాపూ!

బాపు : వృద్ధిలోకి వస్తాడీసుత్రవాడు!

తల్లి : మీదయ!

| నేషనల్ కాంగ్రెస్ | కన్యాశుల్కంలోంచి కనపడే సత్యాలు |
|---|---|

## గిరీశం ఉపన్యాసం:

* కనుక, లోకం బాగుపడే టంకుకు గాను
* వెధవలికి పెళ్ళి చెయ్యటానికి, సాని వాళ్ళని
* సాగనంపటానికి వీరకంకణం కట్టాను. మరే
* వచ్చి; మీ తమ్ముళ్ళాంటి వాళ్ళకి అనేకులికి
* విద్యా బుద్ధులు చెప్తున్నాను. జీతగాణ్ణి
* జౌట చేత నూతుల్లో, గోతుల్లో పడ్డవాళ్ళని
* పైకి తీస్తాను. ఇంకా, నేషనల్ కాంగ్రెస్
* ఒహాటుందిగాని, అగాలో నే చేసే పని
* చాంతాడంత వ్యాఖ్యానం చేస్తేగాని మీకు
* బోధపడదు. పరి పరి విధాల లోకోపకారం
* చేస్తున్నాను. * *

## బుచ్చమ్మ ప్రశ్న:

* లోకాన్ని ఎలా మరమ్మతు చేస్తున్నార్రా?

## వెంకటేశం వ్యాఖ్యానం:

* నావంటి కుర్రవాళ్ళకి చదువు చెప్పడం;
* [నిమ్మళంగా] చుట్ట నేర్పడం; [గట్టిగా]
* నాచ్చి కోశ్చన్ - అనగా సానివాళ్ళ నందర్శ్ని
* దేశం లోంచి వెళ్ళ గొట్టడం ఒహటీ.
* నేషనల్ కాంగ్రెస్ - అనగా [illegible] చలా
* యించడం ఒహటీ. ఇప్పుడు తెలిసిందా?

# మాంత్రికుడు

మూలం:
యూజేన్ సిరికోవ్

అనుసరణ:
శారద

పట్నమంతా అల్లకల్లోలంగా వుంది. సమ్మె వ్యాపిస్తోంది. మొదట కర్మాగారాల్లో బయల్దేరింది. తర్వాత పట్నమంతా వ్యాపించింది. సాయుధ పోలీసులు గస్తీ తిరుగుతున్నారు. ఒక్కొక్కప్పుడు సైనికులు చిటపటలాడే మొహాలతో, తళతళలాడే బాయ్‌నెట్‌లను గురిచేస్తూ, మిలిటరీ బ్యాండు వాయించుకుంటూ బయల్దేరుతారు. అప్పుడప్పుడు ఒక అశ్విక సైనికుడు, కన్నూ మిన్నూ కానకుండా, గుర్రాన్ని రోడ్లవెంబడి పరిగెత్తిస్తాడు. రోడ్డుమీది జనం నలువంకలా పరుగెత్తుతారు వాడి గుర్రం క్రింద పడి నలిగిపోతామని భీతావహంతో.

పట్నం జీవితమంతా పైకి మామూలుగానే నడుస్తోంది. పెద్దవీధుల్లోని షాపుల అద్దాల కిటికీలు తళతళా మెరుస్తున్నై. బజారు రెండువైపులా, ప్రజలు గుంపులు గుంపులుగా పోతున్నారు. మామూలు ప్రకారంగా బాడుగబళ్లు వరసలుతీర్చివున్నాయి కాని వాటిల్లో ఒక రకమైన భీతి గాలిలో కలిసి, ఆవరించినట్టు తోస్తోంది. అతి సామాన్యమైన సంఘటనగూడా భయం కలిగిస్తోంది...

పోలీసువాడి విజిల్ శబ్దం ... టోపీ అన్నా లేని ఒక సామాన్యుడు రోడ్ల వెంబడి పరుగెత్తడం... చివరికి ... తాగుబోతుల గలాటా ... ఇవిగూడా భయం కలిగించినై... ఏమి జరుగుతుందో చూడాలని కొంతమంది తొందరగా వెళ్తారు ... మిగతావాళ్లు కొట్ల వాకిళ్ళ వెనుక దాక్కుంటారు... దేనికో ? ఎవరినించీ ఈ భయం ? ఎవరికీ తెలియదు !

కొన్ని సమయాల్లో, గుంపులు గుంపులుగా, కార్మికులు వీధివెంట వెళ్తారు. వాళ్లు తమ కెదురయ్యే మిత్రులతో ఏవో గుసగుసగా మాట్లాడతారు. చినిగినబట్టలు తొడుక్కునివున్న తమని లెక్కచెయ్యకండా తప్పుకుని వెళ్ళే పెద్ద మనుష్యుల్ని ఈర్ష్యగా చూస్తో వుంటారు. అశ్విక సైనికులు వెంటబడి తరమగానే ఎటు వాళ్లు అటే చెదిరి పారిపోతారు...

## 2

"అమ్మా! వాళ్ళేనా కార్మికులంటే?"

"అటు చూడకురా బాబూ, త్వరగా నడవరా !"

"వాళ్ళెందుకేమ్మా అట్లా పరగెత్తుతున్నారు ?"

"పోలీసుల్నించి తప్పించుకునేందుకు... రా, రా, మాట్లాడకండా"

పోలీసుల్నించా? ఏం! వాళ్ళు రోడ్డు మీద నడవగూడదా అమ్మా?

"అవును... వాళ్ళకి నడవటానికి అనుమతి లేదు"

"ఎందుకని?"

"వూరుకోరా! నన్ను వేధించకు. నా చెయ్యి పట్టుకుని రా తొందరగా లేకపోతే మనకూ కంచీ దెబ్బలు తగులుతాయి".

సర్జ అనే ఆ కుర్రవాడు తల్లి చెయ్యి పట్టుకుని వేగంగా నడుస్తున్నాడు. కార్మికుల గుంపులు చెదిరి నలువంకలా పరుగెత్తడం చూసి వాడు బెదిరిపోయినాడు; కాని ఏంజరుగుతోందో చూడాలని తగని ఆశగా వుంది.

"వాళ్ళు చెడ్డవాళ్ళా అమ్మా?"

"ఎవరురా?"

"ఈ కార్మికులు?"

"నాకు తెలీదు... మంచివాళ్ళూ వున్నారు, చెడ్డవాళ్ళూ వున్నారు... వాళ్లు పని చెయ్యడం లేదు."

"సోమరివాళ్ళా అమ్మా?"

"పోరా! మాట్లాడక నా వెంట రా!"

"వాళ్ళు మురికివాళ్ళా అమ్మా?"

ఈ సమయంలో, కొందరు ఆశ్వికులు పరుగెత్తుకొన్నారు. ఒకడు ఈల వేశాడు. ఒకడు కంచీ విసిరాడు. 'సర్జ' తల్లి కపించి పోయింది. అటుపోతున్న ఒక గుర్రపు బండెక్కి—"ఊం తోలు" అన్నది, భయం ధ్వనించే స్వరంతో.

"ఎక్కడికి పోవాలండి అమ్మా?" అని అడిగాడు బండీవాడు.

"తోలు తొందరగా — నేరుగా పోనీ..."

"భయపడకండమ్మా - వాళ్లు మనని ఏం చెయ్యరు."

అయినా, బండీ ఒక సందులోకి తిరిగింతర్వాతగాని ఆమెకి ప్రాణం తిరిగి రాలేదు. ఆమె బండివాణ్ణి చూచి "నీకు ఇంకో రెండు కోపెక్స్ ఇస్తాను. మర్చిపోకు సుమా" అని హెచ్చరించింది.

"గిట్టుబాటు కాదమ్మా" అన్నాడు బండివాడు.

"అట్లాగైతే బండి ఆపేసేయ్... ట్రాములోనా వెళ్తాం..."

"సరేనండి..... కాని ట్రాములు గూడా, కాసేపటికి ఆగిపోతాయిగా"

"ఎవరు చెప్పారు?"

"వాళ్లూ సమ్మె చేయబోతున్నారు"

బండి పరుగెడుతోంది. ఆమె బండీ వాణ్ణి చూసి, "దేనికీ వీళ్ళతో యింత గొడవ? పనిచేయడానికి యిష్టంలేకపోతే, బయటికి వెళ్తారు.....పొట్ట మాడితే వాళ్ళే పనిలోకి వస్తారుగా?" అన్నది.

బండివాడు ఆమెతో, "ఒక జంతువును మేత పెట్టకుండా మాడ్చి లొంగతీస్తాం. మనిషినీ ఆరకంగా లొంగతీయొచ్చు...— కాని బీదవాణ్ణి అట్లా మాడ్చడం పాపం కదండి?" అన్నాడు.

3

తల్లితో బాటు కుర్రవాడూ, ఇల్లు చేరుకున్నాడు. వాడు తన చెల్లెలిదగ్గర కెళ్ళి రహస్యంగా, "సోనియా! యివ్వాళ మేము కొంతమంది కార్మి

కుల్ని చూశాం......నిజంగా" అన్నాడు ఆశ్చర్యంగా.

"వాళ్లెట్లా వున్నారు చూడ్డానికి?" అని అడిగింది ఆ అమ్మాయి.

"వాళ్ళా?—వాళ్ళు, మన రైతుల్ని ఎరగవూ? అట్లా నేవున్నారు అచ్చంగా !"

కార్మాగారాల్ని ఆపేసి సమ్మె చేస్తూన్న కార్మికుల్ని గురించే రోజూ ఇంట్లో చర్చ జరుగుతోంది. కాని ఆశ్చర్యంవల్ల, కార్మికులు మంచివాళ్ళా, చెడ్డ వాళ్ళా అని నిర్ణయించేందుకు యెవరికీ శక్యం కాదు...

రెండు రోజులకల్లా ట్రాములు ఆగి పోయినాయి...వార్తాపత్రికలు ప్రచురణ కావడంలేదు. వీధులు చీకట్లో మునిగి పోయినాయి. రైల్వేస్టేషన్‌లలో కూడా భీతి ఆవరించింది. తర్వాత రెండు రోజులకు రైళ్ళూ ఆగిపోయినై......వార్తల రాకపోకలు అసలే స్తంభించేట్టు కన్పిస్తోంది.

'సెర్జ్' తండ్రి ఇంటికిముందే రావాల్సింది. కాని రాలేదు. 'సెర్జ్' తల్లికి దిగులెక్కువై అందరిమీదా మండిపడుతోంది. ఇంట్లోవాళ్ళందరూ కార్మికుల్ని తిట్టిపోయసాగారు. కుర్రాడు, కిటికీదగ్గిర నిలబడి బజారులో జరిగేవాటిని శ్రద్ధగా పరికిస్తూ వచ్చాడు.

రోజు రోజుకీ పరిస్థితి విషమిస్తోంది. బజార్లు వుదయంనించే పాడుపడివున్నాయి. కొట్లన్నీ పాడుపడివున్నాయి ... కిటికీలు తలుపులు జాగ్రత్తగా మూసి వుంచుతున్నారు...రాత్రిళ్లు, సోల్జర్లు, ఆశ్వికసైనికులూ, వూరంతా గస్తీ తిరుగుతున్నారు. 'సెర్జ్' అర్ధరాత్రిళ్లు లేచి, కిటికీదగ్గర నిలబడి బజార్లో జరిగే విషయాలను జాగ్రత్తగా, వింతగా, చూస్తాడు...

కాగడాలు ప్రకాశించాయి. ఆ ఎర్రని కాంతులచుట్టూ పోలీసులు కొరివిదయ్యాలకిమల్లె, తారట్లాడుతున్నారు - రాత్రి వేళ, గుప్తమైన, భయంకరమైన సంఘటనలు జరుగుతున్నట్టు తోస్తున్నది ... కుర్రవాడికి వళ్ళు జలదరిస్తుంది...

"అమ్మా ! అమ్మా ! భయమేస్తోందే" అని కేకలువేస్తూ తల్లి దగ్గిరికి పరిగెత్తుకొచ్చాడు, సెర్జ్. తల్లి మేలుకుని, "ఇంకా నిద్రపోలేదురా ? బయిటకెందుకెళ్ళావు?" అని అడిగింది.

"ఇంకా కాగడాలు మండుతున్నాయమ్మా ! వాళ్లు మన ఇంటికెదురుగానే వున్నారింకా !"

"ఏమీ లేదులే, భయపడకు, నిద్రపో! అయ్యో...నాన్న ఇంకా రాలేదుగద.."

"అమ్మా !"

"ఏం తండ్రీ ?

"అమ్మా, నాకు భయమేస్తోందే ... నీదగ్గిరే పడుకుంటా"

"భయమెందుకు తండ్రీ ?"

"ఆ మాంత్రికుల్ని చూస్తే భయమేస్తోందే"

"ఏ మాంత్రికులురా ?"

"సమ్మె చేస్తున్నారే, ఆమాంత్రికుల్ని"

"సరే, ఇట్రారా"

సెర్జ్ లేచి అమ్మ మంచందగ్గిర కెళ్లాడు ఒక్క గంతున. కొంతసేపు గడిచింది. కుర్రాడు, తల్లిచెయ్యి పట్టుకుని చిన్న గొంతుతో మెల్లగా, "వాళ్లు తల్చుకున్నదల్లా చేస్తారల్లేవుందమ్మా !" అన్నాడు.

ఆమె నిద్రపోయింది. కాని కుర్రాడు దుప్పటి తీసేసి గోడవంక చూశాడు. వీధిలో కాగడాల ప్రతిబింబాలు గోడ మీద కదులుతున్నాయి ... తను చదివిన, మాంత్రికులకథలు... జ్ఞాపకానికొచ్చాయి. మంచి మాంత్రికులూ... చెడ్డ మాంత్రికులూ వుంటారు ఆ కథల్లో... కార్మికులని పిలవబడే... మనుష్యుల్ని గురించి కుర్రవాడు తీవ్రంగా ఆలోచించాడు... వాళ్లెవరూ? మంచివాళ్ళా, చెడ్డవాళ్ళా ?

4

ఒకరోజు భోజనం చేసేటప్పుడు మంచి రొట్టెలేదు. కుర్రవాడు వంట మనిషితో "ఇంకో రొట్టె ఇయ్యి" అన్నాడు.

మీ అదృష్టంవల్ల ఈ రొట్టైనా దొరికింది"అన్నది వంటమనిషి.

కుర్రాడు చివాలునలేచి, తల్లిదగ్గిరికి పోయి, "ఏం అమ్మా, ఇది మంచిరొట్టె కాదే" అన్నాడు.

"బాబూ మంచిరొట్టె ఎక్కణ్ణించి వస్తుంది? అన్నికొట్లూ మూసేశారుగా" అంది.

"ఎందుకనీ?"

"కార్మికులు సమ్మెచేస్తున్నారు"

మళ్ళీ ఆ కార్మికులగొడవే! సెర్జ్ తల గోక్కుంటూ "ఈరొట్టెను ఎట్లాతినేట్టు?" అన్నాడు.

"అట్లాగే సరిపెట్టుకోవాలిబాబూ"

"మరే... అమ్మా! వాళ్ళని గవర్నరు గారైనా పనిలోకి పిలవగూడదు? ఆయన వాళ్ళని పనిలోకి వెళ్ళేట్టు చేయగూడదు?"

"ఆయనవల్ల గాదుబాబు, వాళ్ళు ఎవరికీ భయపడరు!"

కుర్రవాడు ఆశ్చర్యచకితుడైనాడు. 'గవర్నరుకిగాని - మరెవరికిగాని భయపడని - ఈ వింతవ్యక్తులు - ఎవరైవుంటారు' అని కుర్రవాడు ఆశ్చర్యపడ్డాడు కార్మాగారాల్ని, ట్రాముల్ని, పత్రికల్ని, - చివరకి రైళ్ళనిగూడా ఆపివెయ్యగలరు వాళ్ళు. కాని వాళ్ళని ఇంకెవ్వరూ ఏమీచెయ్యలేరు!... అరేబియన్ నైట్సులో, దేవతల కథల్లో చదివిన మాంత్రికులు కుర్రవాడికి జ్ఞాపకానికొచ్చారు.

5

వీధుల్లో జరుగుతూవున్న కల్లోలం ఎవరికీ అర్థంకానిరీతి మెల్లగా భాగ్యవంతుల మేడల్లోకి ప్రాకింది. అందువల్లవారు తమ అలవాట్లనీ దైనందిన జీవితాన్ని తప్పనిసరిగా మార్చుకోవలసి వచ్చింది. వారిఆనందమూ, కోలాహలమూ, విందులూ మాయమైనాయి. నవ్వులూ, విలాసాలు కనపడటం లేదు. నిత్యజీవితంలోని ప్రశాంతి నశించింది. వీటికి ప్రతిగా, దారుణమైనభీతి రోజు రోజుకీ పెరగసాగింది. పెద్దపెద్ద భవనాల తలుపులు రోజల్లా మూతబడేవున్నాయి. ఆ భవనాలముందు సాయుధులైన వ్యక్తులు కాపలాకాస్తున్నారు.

ఒక రోజు సెర్జ్ ఇంట్లో విద్యుద్దీపం వెలగలేదు. "దీపంలో ఏదో చెడిపోయిందమ్మా" అన్నాడు సెర్జ్.

"ఆ దీపం వెలగకపోతే, ఇంకోటి వెలిగించు" అన్నది తల్లి.

ఐదునిమిషాలు గడిచాయి.

"ఆ దీపంగూడా వెలగలేదమ్మా" అన్నాడు కుర్రాడు.

"ఓ! ఎలెక్ట్రిక్ కంపెనీలోగూడా సమ్మె

కాబోలు"అంది తల్లి దిగులుగా.

"ఇంట్లో అంధకారం ఆవరించింది. ప్రకాశమానమైన విద్యుద్దీపాలకి బదులు అక్కడక్కడ కొవ్వొత్తులు వెలుగుతున్నై. ఇంతలో పనిమనిషి పరిగెత్తుకొచ్చి.

"రేపు పైపులో నీళ్ళు రావుట, మాంసంగూడా దొరకదట! ఇంకా వారంరోజులు యిట్లాగే వుంటే, ఊళ్ళో కరువు వచ్చేస్తుంది" అన్నది.

"సెర్జి" చాలా భయంతో ఆ వార్తల్ని విన్నాడు. వాడికి కార్మికుడు, చాలా పెద్ద ఆకారంగల వ్యక్తిగా గోచరమైనాడు. కార్మికుడు ఒక మాంత్రికుడు. అల్లావుద్దీన్ దగ్గిరవుండేదే మాయదీపం! అలాంటిదేదో ఈ కార్మికుడిదగ్గిర వుండి వుండాలి! అని ఆ కుర్రవాడి మనస్సుకు స్ఫురించింది!

ఆ మాంత్రికుడు అన్నీ చేయగలడు. ఆతడు తల్చుకుంటే, మళ్ళీ రైలు నడుస్తుంది. నాన్న వచ్చేస్తాడు; ఎలక్ట్రిక్ దీపం వెలుగుతుంది. కాని ఆతనికి ఇష్టం లేదా, పైపుల్లో నీళ్ళు రావు. స్నానం చెయ్యటానికి వీల్లేదు. టీ-కాఫీ దొరకవు. ఆతనికి! ఆ మాంత్రికుడికి — యెవరన్నా భయంలేదు!

కుర్రాడనుకున్నట్టే, రెండు వారాల తర్వాత ఒక్కరోజున అనేక ఆశ్చర్య సంఘటనలు ఒక్కసారిగా జరిగాయి. ట్రాములు మళ్ళీ నడిచాయి; దీపాలు వెలిగాయి; పత్రికలొచ్చాయి. టపాలు మళ్లీ మామూలుగా నడిచాయి. నాన్నగూడా వచ్చేశాడు...టీ మంచి రొట్టె దొరికాయి. ఏకకాలంలో ఎన్నో మంచిపనులుజరిగినై. సెర్జి కుటుంబం అంతా బజారుకి వెళ్లారు. ఇప్పుడా మాంత్రికులు, గుంపులు గుంపులుగా జండాలుపట్టుకుని ఆనందంగా పాడుకుంటూ వెళ్ళడాన్ని కుర్రాడు చూచాడు. ఇప్పుడా మాంత్రికుల్ని ఎవరూ చెదరగొట్టలేరు. వాళ్ళూ ఎవరికీ భయపడి పారిపోరు.

## అప్టన్ సింక్లేర్

ప్రస్తుతసమాజంలోవున్న అభిప్రాయాలు, కార్యవిధానాలు మనకు అతి సహజంగా కన్పిస్తాయి. సులభంగా అలవడుతాయి కూడా. ఒక శీతకాలంలోగాని కళారూపంలోగాని అలాంటి అభిప్రాయాలే ప్రకటితమైనప్పుడు అది "ప్రచారం"గా మనకు కన్పించదు.

కాని మన ఏకాగ్రదృష్టి, విజ్ఞానశక్తి పూర్తిగా వినియోగించి గ్రహించవలసిన కొత్త భావాలను మన మెదుర్కొన్నప్పుడు మనకు శ్రమా, అయిష్టము కలిగి కష్టంవేస్తుంది. అపుడు, ఇదంతా వట్టి "ప్రచారం"అని ఆ భావాలను మనం విమర్శిస్తాము.

★ ఇవాన్ టర్జినీవ్ ★

# తెలివి!

మోసం చెయ్యటంలో బాగా అనుభవం గడించిన ఒక పెద్ద మనిషి ఒకనాడు నాతో ఇలా అన్నాడు.

"నీ శత్రువును విసిగించాలని, హానిచెయ్యాలని ఎన్నడైనా అనుకుంటే; నీలో ఏలోపం వున్నదో తెలుసుకుని అదే సరిగ్గా అతని దుర్గుణమని చెప్పి నిందించు. ఎక్కడాలేని ఆగ్రహావేశాలు తెచ్చుకో! అతన్ని దుయ్యబట్టు!"

"వెంటనే, నీకుమాత్రం ఆ దుర్గుణం లేదని ఇతరు లనుకుంటారు."

"పైగా, నీ ఆగ్రహావేశాల ఉద్ధృతంతో నిన్ను ఇన్నాళ్ళూ నిందిస్తున్న నీ అంతరాత్మమీద కసి తీర్చుకోవచ్చు!"

"ఒకవేళ నువ్వు జన్మతః అవకాశవాదివే ఐతే, నీ శత్రువును అసలతను ఒక సిద్ధాంతమే లేని 'దేశద్రోహి 'అని దూషించు!"

"నీ అంతరాంతరాల్లో నీవే ఒకరి నమ్మిన బంటువైతే, నీశత్రువు అధునాతన నాగరికతకు, యూరప్‌కు, సామ్యవాదానికి దాసానుదాసుడని నిందించు."

అప్పుడు నే నన్నానుగదా: "అసలతన్ని దేశద్రోహి వ్యతిరేక ముఠాకు నమ్మిన బంటుఅన్నా ఫరవాలేదు గదూ"

"ఎందుకనగూడదు?" అన్నాడా పెద్దమనిషి.

# రిపబ్లిక్ వెలిసింది!

★ నాటిక ★

## శ్రీ మహీధర రామమోహన్

**ప్రదేశం :**

యూనియన్ ఆంధ్ర తెలంగాణా హద్దులోని తెలంగాణా గ్రామం.

**కాలం :**

1948 జనవరి నెల తర్వాత.

**రంగం :**

ఊరి వెలపల చింతల క్రింద.

**సమయం :**

సూర్యోదయపు వేళ.

**పాత్రలు :**

1. చింతయ్య
2. భద్రయ్య
   [ గ్రామ రైతులు ]
3. కంఠీరవాచారి
   [ స్టేట్ కాంగ్రెస్ నాయకుడు ]
4. సత్యనారాయణ
   [ గ్రామ కరణం ]

---

మసక మసక ఉన్న సంధ్యచీకట్లలో చింతచెట్ల నీడలు మసిరాసుల్లా కనబడుతున్నాయి. ఆ నీడల క్రిందికి ఒక వేపునుంచి భద్రయ్యా - వేరొక వేపునుంచి చింతయ్యా నీడల్లా జరిగివస్తూ ఎదురెదురుగా తారసిల్లుతారు. ఇద్దరిచేతుల్లోనూ పొడుగుపాటి కర్రలున్నాయి.

---

చింతయ్య : ఎవరువారు? భద్రయ్యా!

భద్రయ్య : ఎవరది? చింతయ్యా!

చింతయ్య : పొలం పోలేదట్రా?

భద్రయ్య : ఇంక పొలం పోటెం? అన్నీ మండబడ్డాయి, కరణపాయన పేరు చెప్పుకొని......

చింతయ్య : ఊళ్ళోకి వచ్చినట్లుంది.

భద్రయ్య : దూరాన గొంతువినబడింది

చింతయ్య : అయితే వచ్చినట్టే!...

భద్రయ్య : నువ్వుచూడలేదన్నమాటే.

చింతయ్య : ఇల్లా బయలెళ్ళేవేం?

భద్రయ్య : అదేరా చిక్కొచ్చింది. ఇదేంటయ్యా అని నలుగుర్లో అడుగుతే ...

చింతయ్య : చెప్తాడూ....?

భద్రయ్య : నువ్వూ కరణపాయనకోసం బయలెళ్ళినట్టేఉంది....

చింతయ్య : పొలంపోతున్నా....

భద్రయ్య : నేనూ అంతే....

చింతయ్య : మరిల్లా వచ్చేవేం?

భద్రయ్య : కరణంగారి నాలుగెకరాల క్రితం ఆరురూపాయలు....

చింతయ్య : జొన్నల బాపతా?

భద్రయ్య : అదే. ఎన్ని మాట్లడిగినా అదిగో, ఇదిగో నంటున్నాడు.

చింతయ్య : అదే గోడకవచ్చిందయ్యా నాకూను. లెవీకంటూ గింజలు పట్టుకపోయారు. ఇప్పుడు నాటి అజలేదు. మళ్ళీ అడుగుతా ఉన్నారు.

భద్రయ్య : అంగుళంలేదు నా కోపానికి. బుర్రమీద ఒక్కటిపెడితే.

చింతయ్య : అక్కపక్క దెబ్బని చచ్చిపోతాడుగా.

భద్రయ్య : చస్తే పీడాపోయిరి.

చింతయ్య : కాని, మనడబ్బుమాటో.

భద్రయ్య : అదీ మాటే

చింతయ్య : డబ్బుఇవ్వకుండేపద్ధతిని వాడు చావడానికి సిద్ధమే.

భద్రయ్య : పోనీ ఓ పని చేద్దాం.

చింతయ్య : చెప్పు

భద్రయ్య : కాళ్లు విరగేస్తే...

చింతయ్య : బాగానే ఉంటుంది. కాని బతికితే వాడితో వేగలేం

భద్రయ్య : అయితే తల పగులగొట్టడమే మంచిది.

చింతయ్య : కాని. ఓపని చేస్తే...

భద్రయ్య : పనిచేస్తేనే ఇంతపనిజరుగుతూంది.

చింతయ్య : బాగాజరగడానికి పనిచెయ్యడం ఎందుకేహాయి....

భద్రయ్య : నవాబు అమ్మ మొగుడిలా ఉంటాడు. కరణంగారయన ఏం చేసి చస్తున్నాడు?

చింతయ్య : కనిపించినవాడి తల్లా పగుల గొట్టి బతుకుతున్నాడు.

భద్రయ్య : వాడితల పగలగొట్టి మనం బతుకుదాం

[తెరలో అడుగుల చప్పుడు]

...ఎవరో వస్తున్నారు.

చింతయ్య : వాడేనేమో.

భద్రయ్య : కానట్టుగుంది.

[కంఠీరవాచారి ప్రవేశం]

కంఠీరవ : (నిలబడి) ఎవరా నీడల్లో నిలబడ్డది. దొంగలు కారుగద?

చింతయ్య : రైతులమండి దొరా!

కంఠీరవా : నీడల్లో నిల్చుండేను.

భద్రయ్య : మావూళ్లో దొంగలు పెద్ద భవంతుల్లోనే నిల్చుంటారు

కంఠీరవ : ఔను. ఊరి వెలుపల నీడల్లో వుండేదేమిటి?

భద్రయ్య : మా వూళ్ళో తాచుపాము లెక్కువగా నీడల్లోనే వుంటాయి...

కంఠీరవ అయితే కష్టమే. త్రాచు పాముకి పగ ఎక్కువ.

చింతయ్య : పామయినా దాని తోక తొక్కకపోతేనే మన్నేమీ చెయ్యదు.

కంఠీరవ : కాటు వేసింతర్వాత నేగాదూ, మనం ఏదోచేసివుంటామని తెలియడం?

భద్రయ్య : అదేంటెండి. మనం చేసేపని మనకే తెలియదంటారా?

కంఠీరవ : మీదీ చిలుమూరేనా?

చింతయ్య : నా పేరు చింతయ్యండి.

భద్రయ్య : నా పేరు భద్రయ్యండి.

కంఠీరవ : వ్యవసాయం చేస్తుంటారు ?

ఇద్దరు } అదే వ్యవసాయం లెండి. దూడ, కాడిలేని వ్యవసాయం.

కంఠీరవ : ఇప్పుడున్నట్లే ఉండిపోతే మీ రెప్పటికీ ఇల్లాగే ఉంటారు

చింతయ్య : ఏదో దారి చూపిస్తే మీ పేరు చెప్పుకుంటాం.

కంఠీరవ : రిపబ్లిక్ పెట్టేసుకోండి!

భద్రయ్య : ఎక్కడ ?

కంఠీరవ : మీ ఊళ్ళోనే

చింతయ్య : అదెక్కడ దొరుకుతుంది ?

కంఠీరవ : మా నాయకులిస్తారు

భద్రయ్య : అదెల్లా ఉంటుంది ? ఎంత ఉంటుంది ?

చింతయ్య : ఒక బండిమీద వస్తుందా ?

కంఠీరవ : (నవ్వుతాడు) అహహహ

చింతయ్య : (చిన్నపుచ్చుకుని) ఏదో తెలియనోళ్ళం.

కంఠీరవ : (నవ్వు ఆపి) రిపబ్లిక్ అంటే ఏమీ లేదు. నవాబు మాకక్కర్లేదనడమే

భద్రయ్య : (అనుమానంతో) అక్కర్లేదంటే పోతాడా ?

కంఠీరవ : వద్దంటూంటే పోకేం చేస్తాడు.

చింతయ్య : మా కరణపాయన పోవాలని పోలేరమ్మకి మొక్కినా పోలేదేం ?

కంఠీరవ : నవాబు ఎప్పుడేనా మీకు కనబడ్డాడో.

చింతయ్య : అద్దుగది. కరణపోడు ఊళ్లో వాడు.

కంఠీరవ : ఊళ్లోవాడైతే మాత్రం ? రిపబ్లిక్‌లో కరణం వుండడు.

భద్రయ్య : (ఎగిరి గంతేసి) నిజమేనా!

కంఠీరవ : మీకు తెలియదు. ఉండడు.

చింతయ్య : అయితే, మాకదేదో అదే. కావాలి.

కంఠీరవ : కాని మీరు పన్నులు లెవీలు మామూలుగా కట్టాలి.

భద్రయ్య : కరణపాయన లేడుగాదూ ?

చింతయ్య : అల్లాఅయితే మాకదేదో వద్దే వద్దు.

కంఠీరవ : వూరంటే మీతో సేవుందా ?

భద్రయ్య : మా కరణపాయన వద్ద పుచ్చుకో, దేశముఖుదగ్గిర పుచ్చుకో మాకు పేచీలేదు. మమ్మళ్ని వ్యయమంటే మాత్రం మావూళ్లో ఒక్కడికి మీద దేంటో అక్కర్లేదు.

కంఠీరవ : మీకేమీ తెలియదు. నవాబు మళ్ళా వస్తే ?

భద్రయ్య : మావూరెప్పుడూ రాడు.

కంఠీరవ : నవాబు బదులు కరణంవస్తాడు.

చింతయ్య : (కర్ర సవరించి నిమురుతూ) రానీ వాడికీకర్ర తగిలిస్తే సరిపడేదానికి లెవీలు, పన్నులుఇచ్చి మేపుతానూ ?

కంఠీరవ : లెవీలు, పన్నులు, కరణానికి కాదు యివ్వడం, కరణం రాకుండా చేసేదానికి యివ్వాలి.

చింతయ్య : నా కర్రకి లెవీలక్కర్లేదు. కావాలంటే మాయింట నాలుగు కర్రలున్నాయి.

భద్రయ్య : కావలస్తే భర్మార్ లుకూడా వున్నాయి.

కంఠీరవ : కరణంతోపాటు రజాకార్లు వస్తే...

చింతయ్య : రాకేం మాదళం పేరు చెప్తే! హుం హుం

కంఠీరవ : దళంఅంటే ఎందరున్నారేం ?

భద్రయ్య : ఎందరూలేకేం ?
చింతయ్య : వూరంతా దళంలోనే చేరేం.
కంఠీరవ : మిలటరీవస్తే ?...
ఇద్దరూ : అప్పుడు ఇవ్వాలాపన్ను ?
కంఠీరవ : ఆ పన్నులు పెట్టి కొంతమంది వలంటీర్లని...
చింతయ్య : అంటే
కంఠీరవ : రజాకార్లు...
చింతయ్య : వాళ్ళకో సంపన్నులియ్యాలా?
భద్రయ్య : ముందు మొయ్య, కానీఖర్చు లేకుండా కర్రతిరగేసేదానికిబదులు పన్నులిస్తాంటావేంటయ్యా.
చింతయ్య : చివరకిదా పెద్దరెడ్డితేబావుం దనుకున్నాం
కంఠీరవ : నేను చెప్పింది తురక రజాకార్ల కాదు. కాంగ్రెసు...
చింతయ్య : కాంగ్రెసు, రజాకార్లూ ఎవరొ చ్చినాసరే మా దళంవుంది పక్కలు విరగ తన్నుతాం.
కంఠీరవ : మీకు సాయం చేసినా ?
చింతయ్య : రజాకార్లు సాయం చేయకేం?
కంఠీరవ : డబ్బు పుచ్చుకోకుండా చేసే వాళ్ళని వలంటీర్లంటారు. గాని నే ఉద్దూలో...
భద్రయ్య : డబ్బు పుచ్చుకోరూ ?
చింతయ్య : అయితే పన్నులూ, లెవీలూ ఎందుకు ?

[కరణం సత్యనారాయణ ప్రవేశం]

సత్యనారా : (వినయపు నవ్వుతో) ఆచారి గారా ! మీరు శ్రమపడుతున్నారే గాని వాళ్ళు తమ ధోరణి మానరు. వృధాయాసం.
భద్రయ్య : మా కరణపాయన మీకు తెలుసా ?
చింతయ్య : మా తెలివిగలాడు బయలు దేరాడు. నా కొడక ! అప్పటి ఆరు రూపాయలు అక్కడ పెడతావా పెట్టవా (కర్ర ఎత్తుతాడు)
సత్యనారా : (ఒణుకుతూ అచారి వెన కకు పరిగెత్తుతాడు) ఇస్తా, ఇచ్చేస్తా.
భద్రయ్య : (కర్ర పట్టుకొంటాడు) ఇప్పుడా దొరికింది, ఊరుకో ఎసే.
చింతయ్య : ఇవ్వక ఏడ పోతావో చూస్తాను. రేపు తెచ్చి యివ్వక పోయావో నీబుర్ర పగల...
కంఠీరవ : ఏమిటీ, ఈ గొడవ...
సత్యనారాయణ : (నుదురు చూపుతూ) గీత, (చింతయ్యవంక తిరిగి) బాబూ యిస్తా. యిచ్చేస్తా, [మరల కంఠీరవాచారితో] రెండేళ్ళక్రితం లెవీ జొన్నల బాపతు ఆరు రూపాయలు కాబోలు ఇవ్వాలి అదే దీనికి మూలం.
కంఠీరవ : (ఆశ్చర్యంతో) ఆరు రూపా యలకా యీ కర్ర లెత్తడం.
భద్రయ్య : మాకా ఆరు రూపాయలూ వెన్నిధి కదండీ ?
కంఠీరవ : (తలతిప్పుతూ) అబ్బే ! అదేం బాగో లేదు. చూశారా? యిల్లాంటి అల్లరు జరిగి ఒకరికలలు ఒకరు పగలగొట్టుకోకుండా మావా ళ్ళని పంపిస్తాం.
సత్యనారా : (ఆతురతగా) పంపండి తప్పకుండా పంపండి. ఒక పాతిక మందిని వెంటనే పంపండి. తెలియక చింతయ్య యేదో తొందరపడ్డాడు గాని, అతడు చాలా మంచివాడు.

మన వలంటీర్లకు ఆయుధాలు కావలసి వస్తే మా వూళ్లో వాళ్ళిస్తారు

భద్రయ్య: ఒక్కటికూడా యివ్వం

చింతయ్య: వాళ్ళేవళ్ళో వూళ్ళో కాలు పెడితే ఇంకచూచుకోండి మాత డాఖా.

కంఠీరవ: సత్యనారయణగారూ! మీరు కాంగ్రెస్‌లో చేరి కరిణీకానికి రాజీ నామా పెట్టినట్లు వీళ్ళతో చెప్పేరా!

సత్యనారా: (వినయంఅభినయిస్తూ) అదే మంత పెద్దవిషయమని చెప్పుకోడం?

కంఠీరవ: ఏమి మంచితనం? (చింతయ్య వంక తిరిగి) చూశారా? వారంతటి మహానుభావుణ్ణి, వినయశీలుణ్ణి తొందర పడి ఎంతమాటలనేశారో చూశారా? ఓహోహో ఎంతత్యాగం? ఎటువంటి మహానుభావుడు? కరిణీకానికి రాజీ నామా పెట్టేశాడు.

భద్రయ్య: అయితే?

కంఠీరవ: అది ఎంతటి గొప్ప త్యాగం?

చింతయ్య: త్యాగమంటే?

కంఠీరవ: తనకున్నది వొదిలెయ్యడం.

చింతయ్య: కరణీకం వొదలకపోతే వీపు చిట్లిపోతుందని ఎరుగడేం?

సత్యనారా: వాళ్లు ఏమనుకుంటే నేం? నా మనస్సులో మలినంలేదు. పోనీ వ్వండి: వాళ్ళే గ్రహిస్తారు కొంత కాలానికి.

కంఠీరవ: (తల త్రిప్పుతూ) ఏమినిగర్వి!

సత్యనారా: పోనివ్వండి, పోనివ్వండి.

కంఠీరవ: అటువంటి మహానుభావుణ్ణి అల్లాగ అనుమానించి అవమానించి నందుకు చింతయ్యగారు క్షమాపణ చెప్పుకోవాలి.

చింతయ్య: (చురుక్కున దూసుకు పొయ్యేలాగ చూస్తూ వూరుకుంటాడు)

కంఠీరవ: అటువంటి మహాత్ముణ్ణి తగినట్లు గౌరవించాలి.

చింతయ్య: కఱ్ఱ తిరగేసి-

భద్రయ్య: వూరుకో నే ఆయనేం దో సెప్తుంటే...

కంఠీరవ: ఈయన చాలా పెద్దమనిషిలా గున్నారు.

సత్యనారా: ఇటువంటివాళ్ళు ఇంకా వుండడంచేతనే అనండి, ఓ మారు కాకుంటే. ఓమారేనాడూళ్లోకిరావడం..

కంఠీరవ: ఇటువంటి వారి సహాయంతో మీరు గ్రామాన్నీ, గ్రామస్థుల్నీ మరా మతు చేయాలేగాని ఎవరో ఏదో అన్నారని కోపగించివూరుకోవలడమే.

సత్యనారా: నాకు కోపమేమిటి? ఎంత మాట సెలవిచ్చారు!

కంఠీరవ: భద్రయ్యగారూ!

భద్రయ్య: చిత్తం!

కంఠీరవ: మీరు రిపబ్లిక్ పెట్టుకోవటం నిశ్చయమేనా?

భద్రయ్య: మాకు కరణం ఒద్దు.

చింతయ్య: ఉంటే రిపబ్లికూ వద్దు.

కంఠీరవ: సత్యనారాయణగారు చాలా మంచి వారు. చదువుకొన్నవారు. కాంగ్రెస్‌లో చేరి కరిణీకం వదిలే సిన...

చింతయ్య: కఱ్ఱదెబ్బకి దెయ్యంకూడా పరుగెత్తుతుంది.

కంఠీరవ: అటువంటిమహానుభావుణ్ణి మీరు రిపబ్లికుకు అధ్యక్షుణ్ణి చేయండి.

భద్రయ్య : అధ్యక్షుండటే.
కంఠీరవ : ఊరిపెద్ద.
చింతయ్య : అయితే మా సంగంపెద్దే మా వూరిపెద్ద.
సత్యనారా : సంగంపెద్దంటే ఓ కమ్యూనిస్టు లేండి.
కంఠీరవ : అబ్బె బ్బె పనికిరాదు.
భద్రయ్య : ఎందుచేత ?
కంఠీరవ : కాంగ్రెసు, కమ్యూనిస్టులకే సరిపడదు.
చింతయ్య : మా సంగంపెద్ద కమ్యూనిస్టేనా ?
సత్యనారా : ఏమీ సందేహంలేదు
భద్రయ్య : అయితే మాకుసరిపడదు.
కంఠీరవ : అదీమాట, మనం కమ్యూనిస్టుల్ని చేరనివ్వకూడదు.
చింతయ్య : కరణపాయన్ని చేరనివ్వచ్చా.
కంఠీరవ : అఁ నింక కరణమే కాదుగా.
భద్రయ్య : యేమయినాసరే, మాసంగం పెద్దే మాకుచాలు. కరణపాడూవద్దు, కాంగ్రెసోడూవద్దు.
సత్యనారా : మీరు సంఘంలో చేరారు. కాంగ్రెసుకి కోపంవస్తాంది.
కంఠీరవ : నేలబెట్టి రానేస్తాం.
(చింతయ్య భద్రయ్య కర్రలుతీసుకొని తిప్పుతారు.)
చింతయ్య : (మీదికొచ్చి) కరణపాడు ఎగురుతున్నాడు.
కంఠీరవ : (రివాల్వరుగాలిలోకిపేల్చి) కదలండి. ఛస్తారు.

(చింతయ్య,భద్రయ్యపడిపోయారు.)
చింతయ్య : వుండండి మీపనిచెప్తాం.
(ఇద్దరూ వెనక్కి పరుగెత్తుతారు.)
సత్యనారా : వీళ్ళు వట్టి మోటుపశువులు. రివాల్వరు వుండగనక బ్రతికాం కాని...
కంఠీరవ : ఇంకా నెమ్మదిగా అంటున్నారు
సత్యనారాం ! పదిమందివస్తుంటారు పోదాం
కంఠీరవ : ఈ గ్రామ రిపబ్లిక్కి మీరే అధ్యక్షులుగా వుండాలి.
సత్యనారా : లేకపోతే కమ్యూనిస్టులకే పోతుంది.
కంఠీరవ : అందుకే తమరు తీసుకోవాలి.
సత్యనారా : తప్పుతుందా ? కాంగ్రెసాజ్ఞ కాని...
కంఠీరవ . సందేహం వద్దు, తప్పదు.
సత్యనారా : ఈ తుంటరిమూకనుంచి మన రిపబ్లిక్‌ను రక్షించుకోవాలంటేయూనియన్‌లోనే పెట్టుకోవాలి మన ఆఫీసు [తెరలో 'సంగానికి జై' - అంటూ విజయధ్వనులు] రిపబ్లికును ఈమూకనుండి రక్షించేందుకు...
కంఠీరవ : ఇరవై అయిదుగురు జెటీల లాంటి వలంటీర్లనిస్తా కాదూ.
(మరల జయధ్వనులు)
సత్యనారా : ఇంక సందేహంలేదు. నడవండి. త్వరగా వెళ్ళిపోక, వాళ్ళ చేతుల్లో పడ్డామా, యింక రిపబ్లిక్ పేరు ఎత్తేవాళ్లుకూడా గ్రామంలో మిగలరు. (పరుగెత్తుతారు.)

(తెరలో జయజయ ధ్వనులు)



# తెలంగాణా అమర వీరుని రక్తాంజలి!

★ శ్రీ దాశరధి ★

రక్తం కారుతున్న పశ్చిమాకాశం కిటికీలోనుంచి భయంకరంగా కనిపిస్తున్నది. తన దవడల్లోనించి కారుతున్న రక్తాన్ని చేతితో తుడుచుకున్నాడు విశ్వం. రెండో చేతితో తుడుచుకున్నాడు. రెండు అరచేతులూ దగ్గరగా పెట్టిచూచుకున్నాడు. దవడల్లోనించి నెత్తురు చుక్కలురాలాయి. దోసిట్లో నెత్తురుగుడ్డలనిండా నెత్తురు. కిటికీలో నెత్తురు. ఎక్కడో లోపలనుంచి వస్తోంది రక్తం - పర్వత గర్భం నుంచి వచ్చే నదిమాదిరి.

వెనక్కు తిరిగిచూచాడు విశ్వం. చీకటిగది (dark cell) తలుపు మూసేసి వెళ్ళిపోతున్నాడు. కాపలా జవాన్. ఆ చిన్నిపాటి కిటికీలో పశ్చిమాకాశపు నెత్తుటి వెలుగు ఎంతో సేపు ఆగలేకపోయింది. చీకటి చొచ్చుకోవచ్చింది.

నెలరోజులు కస్టడీలో నానా హింసలూపెట్టి, రహస్య స్థావరాల భోగట్టా సేకరించ శక్యంకాక విశ్వాన్ని సెంట్రల్ జైలుకు పంపివేశాడు. డి. యస్. పి. ప్రతిరోజూ సాయంత్రం ఆకాశం దవడల్లో నెత్తురు, తన దవడల్లో నెత్తురు. ఇవాళ తుదిరోజు తుదిపాటు కసి తీరా కొట్టి జైలుకు పంపించేశారు. ఇహ రేపటినుంచి రక్తం కనిపించదు.

హాహాహాహా! హాహాహా చీకట్లో తనకు తానే నవ్వుకున్నాడు. దవడల్లో

నుంచి వచ్చే నెత్తురు కనిపించ కండా చీకటి అడ్డంవచ్చింది.

ఏకాంతంలో, నిశ్శబ్దంలో, చీకటిలో కళ్లుమూసుకున్నాడు విశ్వం. చీకట్లో మళ్ళీ నవ్వాడు. పోలీసు బలగం తనముందు వోడిపోయింది. తన వొంటిలోనించి జారిపోయిన ప్రతి రక్తం చుక్కా గెలిచింది. విరిగిన ప్రతి కీలూ గెలిచింది. గెరిల్లాల రహస్య స్థావరం సురక్షితంగా వుండిపోయింది. హాహాహా, హాహా.

ఎన్నడూ లేనంత లోతుగా నిద్రపోయాడు విశ్వం. సూర్య గోళాన్ని తనవైపు లాక్కుంటు న్నాడు. సూర్యునిచుట్టూ తిరిగే గోళాలన్నీ తనచుట్టు ప్రదక్షిణం చేస్తున్నె. బ్రహ్మాండపు లా అండ్ ఆర్డర్ పట్టీ కొట్టింది. ఇంక్విలాబ్! జిందాబాద్...!

చర్చిలూ, ట్రూమనూ ఆటం బాంబులతో నైజాం యింట్లో విందారగిస్తున్నారు. నల్లగొండ పల్లెటూళ్ళల్లో తల్లీ పిల్లా ఆకలి మంటల్లో 'ఇంక్విలాబ్' మంత్రం జపిస్తున్నారు.

నైజాం రాక్షసినోట్లో నరనరంలో తిరుగుబాటు, రోమ రోమంలో విప్లవం కదులుతున్నది. జ్వరం! నైజాం రాజుకు జ్వరం! సన్నిపాతం, ఉన్మాదం, స్వతంత్ర హైద్రాబాద్!

డొక్క వెన్నంటిన పేదరైతు కళ్ళల్లో మిరుగుళ్ళను వూది వూది మంటచేసి కాగడా వెలిగించి కింకోటి శిఖరానికి నిప్పు ముట్టిస్తు న్నాడు విశ్వం. నైజాం నరాల్లో చొరబడి రక్తాణువులకు తిరుగు బాటు బోధిస్తున్నాడు. నరాల నెప్పుల్ని సర్దుకోడానికి కత్తితో కండల్ని కోసుకుంటున్నాడు నైజాం. తెగిపోయిన కండరాలు నవ్వు తున్నాయి. హాహాహాహా. హాహాహా.

నరాల్లో విశ్వం, విశ్వం వెంట విశ్వం.

చీకటిగదిలోకి వెలుతుర్లు తొంగితొంగి చూస్తున్నాయి. విశ్వం ఆవులించి లేచాడు. ఎండి పోయిన నెత్తురు చారల్ని తడుము కున్నాడు.

"బ్యారక్కులోకి పదండి" అన్నాడు కాపలా జవాను. విశ్వం చరచరా అతనివెంట నడిచాడు.

వీళ్ళంతా యెవరు ?! వందలమంది బందీలు, క వు లు, గాయకులు, విద్యార్థులు, రైతులు, కూలీలు, జమీందార్లు, షావుకార్లు, స్త్రీలు, వీళ్ళే దేశం. దేశమంతా రాజ ద్రోహులే ? దేశాన్ని జైల్లో కట్టే శాడు నైజాం. ఈ జైళ్ళు పికిలి పోతై. ఆ గోడలు వీళ్ళను అడ్డ లేవు. ఈ పో లీ సు ల కాపలా ఆగదు.

"మేం యే డు వం ద లున్నాం, భయపడ కేం !"

"అతని చేయి విరుచుకుంది నైజాంరాక్షసి"

"ఇతనికాలు నమిలేసింది."

"వీడి డొక్కలో ఏడుమాట్లు కాల్చారు."

"ఇతని భుజం యెగిరిపోయింది.

"నీ దవడకు దెబ్బతగిలిందా?"

విశ్వం నిర్ఘాంతపోయాడు. తన దగ్గిరనించి చాలా కొద్దిరక్తాన్నే తాగాడు నైజాం. వీళ్ళంతా బిందె లతో తాగించారు ర క్తం. అమి తంగా తాగి తం ద నా లా డు తున్నాడు నైజాం. తల తిరుగు తోంది. ఇహా క క్కేస్తాడు, పడి పోతాడు. ఈ ర క్తం జీర్ణంకాదు. ఇమడదు.

విశ్వం జైలుప్రాంతం గబగబా తిరిగి చూచాడు. ఏడువందల మందికి వొక్కేవక నీ ళ్ళ పం పు. ఇందరూ స్నానంచేయాలి, గుడ్డలు వుతుక్కోవాలి. తాగాలి. అన్ని టికీ సరిపుచ్చుకోవాలి! కొండ దోమ కరిచిందా జ్వరం తప్పదు. నిజామాబాదు జైలు అచ్చంగా నరకం. నీళ్ళనిండా ప చ్చ గా పాకుడు, క్రిములు. నీళ్లులాగేమర వారానికి రెండుసార్లు చెడుతుంది ఆ రోజల్లా దప్పితో, ఆకలితో యేకాదశిగడపాలి. రెండు జొన్న రొట్టెలు ఆహారం. వా టి ల్లో సున్నం, మన్ను, గడ్డి, ఇసుక. లోపల వుడకదు రొట్టె. పైన మాత్రం మాడుతుంది. ప ప్పు పులుసులోదుర్వాసన, పురుగులు, చెత్త. ఈ రెం డు రొట్టెలు, గం ెడు పులుసుతో విట మిన్లన్నీ లభించాలి ?

డిసెంట్రీ, మలేరియా, డయే రియా! మందులు ఇండియా ప్రభు త్వం ఆపిందట. హ్యూ గ్ స ల్ఫ

సైతం లేదు. మండిపోతున్న ఎండ కాలంలో మజ్జిగేది ? ల్యాట్రిన్‌ల నిండా రక్తం మడుగులు. దుర్గంధ్య చనిపోయాడు డిసెంట్రీతో పాపం! పెళ్ళాం పిల్లలు జైలుగేటుముందు రెండు రాత్రులు ఏడిచారు. శవం సైతం దొరకలేదు వాళ్ళకి.

బాధలకు భయపడకండి. గుండె బండ చేసుకోవాలి. ధైర్యం తెచ్చుకోవాలి. చావు చాలా చవక. బ్రతుకున్న బ్లాక్ మార్కెటు ధర. మనశ్శాంతికి, ఉత్సాహానికి 'వందేమాతరం' పాడుకుందాం.

"వందేమాతరం పాడావా చంపేస్తాం"

"నీకేం ! మేం పాడుకుంటే?"

"హిందూ ప్రార్థన మేం వినం"

"ఇందులో హిందూ సమస్యే లేదు."

"కాంగ్రెస్ కమ్యూనిస్ట్ అంతా హిందూలే"

"ఇదే మతోన్మాదం"

"ఖామూష్ ..."

"అసలు నీవీ బ్యారక్కులో యెందుకు ?"

"ఇందులోనే వుంటా"

"అయితే మేం పాడుకుంటాం"

"ఏదీ పాడు, చూస్తా"

"వందే..." ఫెళ్ళుమంది విశ్వం దవడమీద బలంగా కొట్టాడు ముస్లిం క్రిమినల్. మళ్ళీ సాగింది ఆగి పోయినరక్తం అరచేతితో తుడుచు కున్నాడు విశ్వం. క్రిమినల్ కళ్ళు యెర్రగా వున్నాయి. బాగా తాగాడు. జైల్లో సారాయి ? జైలు అధికార్లే తాగించారు. ఏదో కుట్ర

"ఇంక్విలాబ్ జిందాబాద్ !" విశ్వం గర్జించాడు. విశ్వం దవడ మళ్ళీ కొట్టాడు క్రిమినల్. వెనక నుంచి క్రిమినల్ గూబ బద్దలైంది.

"హిందూలు నన్ను చంపుతు న్నారు, రాండి ! రాండి !"అని గట్టిగా అరిచాడు క్రిమినల్.

"మేం సహాయంచేస్తాం" లాఠీ లతో, ఇనపసీకులతో ముస్లిం గుండాలు జైల్లోకి ప్రవేశించారు నిరాటంకంగా జైలుగేట్లనీ తెరు చుకున్నై. బారక్కు తలుపుల తాళాలు పడివడినై.

"పోలీస్ ! పోలీస్"అని పిలుస్తో బ్యారక్కు అవతలకి పరిగెత్తాడు

శ్వం. ఫట్ విరుచుకోపడ్డాడు విశ్వం. తలమీదలాఠీదెబ్బపడింది.

గూండాలు ఇనపసీకులతో, కర్రలతో బంధితుల్ని కొడుతున్నారు.

"వందేమాతరం——"

"అల్లాహూ అక్బర్"

"ఇంక్విలాబ్ ——"

"సారే తక్‌బీర్"

కల్లోలం, కోలాహలం. నిరాయుధుల్ని, నిర్బంధితుల్ని, నిరపరాధుల్ని కొడుతున్నారు. పడిపోయిన విశ్వాన్ని తొక్కుతూ గూండాలు పరుగెత్తి వస్తున్నారు. అరచేతితో తలమీది గాయం అదుముకున్నాడు విశ్వం. లేచినుంచున్నాడు. ఘోరం జరుగుతున్నది. అనేకులు నేలకు వ్రాలుగుతున్నారు.

"ఎదిరించి చావండి. ఇంక్విలాబ్ జిందాబాద్ !" గర్జించాడు విశ్వం. గూండాల లాఠీలు రక్తం తాగుతున్నై. విశ్వం వొకగూండా నడుంమీద దూకాడు. వాడి లాఠీ గుంజుకున్నాడు. విసరడం ప్రారంభించాడు

"లాఠీలు గుంజుకుని ఎదురుదెబ్బ తీయండి" అరిచాడు విశ్వం. పళ్లాలు, గ్లాసులు విసురుతున్నారు బందీలు. వాటి తాకిడికే గూండాల బుర్రలు గింగురుమంటున్నై. విశ్వం లాఠీదెబ్బలకు ముగ్గురు పడుకున్నారు గూండాలు. మళ్ళీ ఆరుగురు గూండాలు విశ్వాన్ని చుట్టేశారు. ఇనపసీకుల దాడికి విశ్వం లాఠీ ఎగిరిపోయింది. ఫెట్! విశ్వం తలమీద ఇనపసీకు దెబ్బపడ్డది. కూలిపోయాడు విశ్వం. పిడుగు పడ్డట్టయింది. పడిపోయినవాణ్ణికసితీరా కొట్టి పారిపోయారు గూండాలు.

"దప్పి, దప్పి, ఇంక్విలాబ్ !" అంటున్నాడు విశ్వం. నీళ్లులేవు. బ్యారక్కునిండా రక్తం పరుచుకుంది. విశ్వం రక్తంలో దొర్లుతున్నాడు.

"గూండారాజ్ ముర్దాబాద్" యేడువందలమంది యేకకంఠంగా అరిచారు. "ఇంక్విలాబ్ జిందాబాద్". విశ్వం నెత్తురులో దొర్లుతున్నాడు. దప్పి, దప్పి, నీళ్ళు లేవు, మందు లేదు.

"హా హా హా హా" పెద్దగా నవ్వాడు విశ్వం.

బ్యారక్‌లో రాజకీయ ఖైదీలు నలుగురు విశ్వం చుట్టు మూగారు.

చీకటి !

"నవ్వుతావేం విశ్వం ?"

"నైజాం వోడి పోయాడు"

"డెలెమా కమ్ముకుంటున్నది విశ్వాసకి"

"దోసిట్లో నెత్తురుసింపుకోండి"

"విశ్వం !"

"హాహాహాహా"

"అట్లా నవ్వుతావేం ?"

"మనం గెలిచాం..."

ఆకాశం నోరు తెరిచింది. నోటి నిండా నెత్తురు. విశ్వం వొంటి నిండా నెత్తురు రెండువాదలనుంది నిస్సహాయుల రక్తంతో రంగులద్దుకున్న జైలుగోడలమీద సూర్య కిరణాలు మెరుస్తున్నాయి. నిరాయుధుల్ని హింసించిన గూండాల రాజభక్తికి ధైర్యసాహసాలకు ఆనందిస్తున్నాడు నైజాం కింగ్ కోటలో. భవిష్యత్తు దొంగ చాటుగా తొంగి తొంగి చూస్తున్నది నైజామును మింగాలని.

నెత్తుగు అంటిన రెండు అర చేతుల్ని దగ్గరగా చేర్చుకుని పడి వున్నాడు విశ్వం. విశ్వం. దోసిట్లో కన్నీళ్ళు కార్చారు మిత్రులు.

నవ్వుతున్నాడు విశ్వం ఆకాశంలో సూర్యగోళం అతనిచుట్టూ నృత్యం చేస్తున్నది.

ప్రాగాకాశంలో రక్తాంజలి.

---

## ఎమర్సన్ :

ఎప్పుడైతే సంకెళ్ళు ఒక చివర బానిస ముంజేతిని బంధిస్తాయో, తప్పనిసరిగా రెండో చివర యజమాని చేతికి బిగుసుకుంటాయి.

**★ ఇవాన్ టర్జినీవ్ ★**

# జర్నలిస్టు

ఇద్దరు మిత్రులు టేబిల్ దగ్గరకూచుని టీ తాగుతున్నారు.

వీధిలోనుంచి హఠాత్తుగా గలభా వినిపించింది. హృదయ విదారకమైన రోదన, చెవులు చిల్లులుపడే బూతులు, విషపూరితమైన నవ్వు విన్పించసాగాయి.

కిటికీలోనుంచి బైటికిచూస్తూ ఒక మిత్రుడన్నాడుగదా : "ఎవరినో కొడుతున్నారు."

"ఎవరది? దొంగా? హంతకుడా? ఎవరు?" అంటూ రెండవ మిత్రుడన్నాడుగదా; "ఎవరైతేనేం! ఒక అసహాయుణ్ణి పట్టుకుని ఇష్టమొచ్చినట్లు కొడితే చూస్తూ ఊరుకుంటామా! లే! వెళ్ళి అతని తరఫున నిలబడదాం" అని.

"అతను హంతకుడు కాదు!"

"కాదు? ఐతే దొంగేమో? ఐతేఅయింది వెళ్ళి అతన్ని రక్షిద్దాం - పద"

"అబ్బే దొంగకూడాకాదు!"

"కాదు? బహుశా ఏ రైల్వే ఉద్యోగో, కాషియరో, కంట్రాక్టరో, అవుతాడు. ఎవరైతేనేం, వెళ్ళిసహాయం చేద్దాంపద"

"అతనెవరో జర్నలిస్టు!"

"జర్నలిస్టా! హు! ఐతే, ముందు టీ తాగుదాం కూచో".



చిన్న కథ

# దున్నే వానిదే భూమి

—నవకుమార్

రామయ్యతాత ఈనాడు నడుం వంగి, తలనెరసి, సత్తువుడిగిపోయాడు. కాని, ఒకనాడు మోహన్‌వలె యువకుడే. ఆనాడు తన తండ్రి నన్యాయంచేసి జమీందారు సగంపొలం కాజేశాడు. తన తండ్రి చేసేదేమీలేక "కర్మ" అని వూరుకున్నాడు. నాటినుండి నాలుగెకరాల కొండ్రతో రామయ్యతాత యీడ్చుకొస్తున్నాడు. ఈలోపల అనేక విశేషాలు, సంఘర్షణలు జరిగాయి. ఉన్నదానిని నిలుపుకోవడమే ప్రధానమనుకొన్నట్లు తాత వాటన్నింటికీ దూరంగా వుంటూ వచ్చాడు. అతనిలో ఏవో ఆలోచనలు పుట్టేవి. అతని హృదయం న్యాయం కోసం పరితపించేది. వుద్రేకపడేది, కాని ...ఈ "కాని"తో రామయ్యతాత మెదడు వేడెక్కేది. తాత ఆలోచించేవాడు తర్కించేవాడు. అతని ఆలోచన తరతరాల కష్టాల నెదొర్కొని అసమర్థమైంది. అతను ఎంతో ఆలోచించేవాడు. సమాధానం ఒకటే—"మనం పట్టుబట్టి నెగ్గలిగితే కావలిసిందేముంది! ఐనా, బ్రహ్మ రాత తప్పించడం ఎవడితరం! భార్యపోయిన దగ్గరనుంచి తినో. తినకో అడిని పెద్దాడిని చేశా. ఆడి గీత బాగుంటే నాలుగు మెతుకులకు లోటు లేకుండా జరుగుతుంది."

తాతకు ఎప్పుడూ ఇదే ఆలోచన నాగలి దున్నేటప్పుడు, కుప్పనూర్చేటప్పుడు, అన్నం తినే వేళ, చుట్టకాల్చేటప్పుడు, నిద్రపోయేముందు - ఎప్పుడూ ఇదే ఆలోచన.

మోహన్‌ను చదివిద్దామనికూడ చాల సార్లు ఆలోచించాడు. "అడితిప్పలాడు బడతాడు ఏదో నాలుగుముక్కలు చెప్పిస్తే కాస్త గౌరవంగా బ్రతుకుతాడు," అనుకునేవాడు. కాని వూళ్లోవున్న గ్రాంటు స్కూల్లో ఐదవ తరగతివరకు చెప్పించే సరికి గగనమైంది. కొండ్రకుమించిన దేముంది? చదువుకున్న వాళ్ళందరూ వుద్యోగాలు చేస్తున్నారా? కాస్త అండదండగా వుంటాడు. పనిగొడవలోపడితేనే మంచిదని చదువు మాన్పించాడు. "చుకు

కైన కుర్రవాడు. చదివించు! పైకి వస్తాడు" అని బడిపంతులనేకసార్లు చెప్పినా వినిపించుకోలేదు.

"నాయనా! తీరిగ్గా వున్నప్పుడు పంతులుగారి దగ్గరకు వెళ్ళి కాస్త లెక్కాడొక్కా నేర్చుకో. ఏదో యీవిధంగా బండిని సాగించుకపోయినా యీ చేతుల మీదుగా నిన్నొకయింటివాణ్ణి చేసి సుఖంగా వెళ్లిపోతా!" అనిమాత్రం అంటూ వుండేవాడు.

* * *

రోజులుగడచిపోతున్నాయి. వారాలు నెలలు, సంవత్సరాలు. తాతకంతా అగమ్యగోచరంగావుంది. తన తండ్రులనాటికంటె యీనాడు దేశం తెలివిమీరిపోయింది అందరికీ రాజకీయాలే. ఏమూల జూచినా వివాదాలే అన్నీ పార్టీలే. ఒకళ్ళంటే ఒకళ్ళకు గిట్టదు. చర్చలు, సిద్ధాంతాలు, ఉపన్యాసాలు

మోహన్‌కు వివాహమైనప్పట్నుంచీ ఒక కొత్త ఉత్సాహం, ఆవేశం వచ్చిపడ్డాయి భార్యవల్ల కాదు. మామగారి ఊళ్ళో పరిస్థితి అలాంటిది! ఒక పుస్తకాలేమిటి. ఒక మీటింగులేమిటి అన్నీ అవే. ఎప్పుడూ తమగ్రామంలోకూడ యువకుల్ని ప్రోగుచేసి రాజకీయాలుచెబుతూవుండేవాడు. అప్పుడప్పుడు మీటింగులు జరిగేవి. రామయ్యతాతకు మోహన్ చెప్పేదంతా న్యాయంగానే కన్పించేది. అతనికి తిరుగు చెప్పలేక పోయేవాడు. తన మనస్సులో ఎన్నాళ్లనుంచో వున్న కోర్కె! ఆకోర్కె మహావేశాంతమై కంచుగంటలాగ మ్రోగుతున్నది. ఈలోపల వరద వచ్చింది పోయింది. ఆయేడు అయిన అప్పులకు ఒక యకరం భూమి కూడ జమీందార్లకు దత్తతయింది.

తాత శక్తులుడిగి పనిచేయలేకపోయినా గేదెల్ని మేపుకురావడం, తనతోబాటు వృద్ధాప్యంలో వూగిపలాడే బోడెద్దు సంరక్షణ చేయడంపనిగాపెట్టుకున్నాడు. నాలుగు సంవత్సరాల నుంచి ఒక ఎద్దుతోనే బక్కళ్ళ వ్యవసాయం చేస్తూ నెట్టుకొస్తున్నారు ఇక యీ సంవత్సరం ఏ విధంగా అద్దెపెట్టుకుందామన్నా పనిగడిచేట్టులేదు. వరద వచ్చి మూడెకరాల పంట పోయింది. ఇంకెలాగ బ్రతికేది?

* * *

తీరిగ్గా వున్నరోజుల్లో రైతులంతా ఒకచోట చేరిపిచ్చాపాటి మాట్లాడుకుంటూ వుంటారు. ఆసంవత్సరం వరదలో పనులు కుంటుబడిపోయినా ఒకనాడు లంక రైతులంతా ఊడలుదిగిన పెద్దమర్రిక్రింద సమావేశమయారు. కాని వారి ముఖాల్లో ఉత్సాహం మాత్రం లేదు. వారిలో ఒక మూల రామయ్య తాతకూడ చుట్టకాల్చుకుంటూ విచారంగా కూర్చున్నాడు.

"నాయనా ఏమో! ఎక్కడ చూసినా కరువు, కరువుఅంటున్నారు. ఆ కాంగ్రెస్ మంత్రుల చలవవల్లనైనా మన అదృష్టం బాగుంటేతొందరలో నేదున్నకోవచ్చులే. ఓటిచ్చిం విశ్వాసమైనా వుండదా?" అన్నాడు రామయ్య తాత మాటల సందర్భంలో.

"మనం రోజూ వార్తలు వింటూకూడా మంత్రుల చలవ అనుకోవడం బాగానే వుంది. ఒకవైపు జమీందారు పోలీసు బల

గంతో తయారై చేలోకివస్తే కాల్చేయ డాన్కి-కూడా సిద్ధంగావున్నాడు. అదీ గాక మునిగిపోయినంతమాత్రాన వాడిపొల మెట్లా అవుతుంది. రామయ్యతాతా ! మీ కాలంలో జమీందారు కెంత పొలముం డేది ?"అని ధారాళంగా మాట్లాడుతు న్నాడు రైతుబిడ్డ సుబ్బారావు.

"అసలు మా తండ్రుల కాలంలో సెంటు పొలముండేదేమిటి ? అప్పుడు ఈ పొలమంతా రై తు ల దే గదంటగా: ఎక్కడ కాస్త దండినా రండిగా వుండేది, ఆ ముంపుకు కాస్త, ఆ ముంపుకు కాస్త యిప్పుడిప్పుడు నానా దుర్మార్గాలతో ఎక్కడ చూసినా జమీందారు పొలమ యిందిగాని..."ఇంకా రామయ్య తాత ఏదో చెప్పబోతున్నాడు. ఇంతలో వాళ్ల కులాసా కాలక్షేపానికి భంగం కలిగిస్తూ చాటింపు వినిపించింది—

"ఇందుమూలముగా అందరికి తెలియ జేసేదేమిటంటే ఈయేడు తేలిన పొల మంతా జమీందారుగారు మా లచ్చమ్మ మేడదగ్గిర పాటబెడతారుగనుక కావాల్సి నోరు పాడుకోవొచ్చో హూ—ఓ

. అంతా విన్నారు. అందరికీ అర్థమ యింది. తనదికాని పొలాన్ని వేలం వేసే ఆ తత్వానికి అందరి ముఖాలూ క్రోధంతో ఉద్రేకంతో ఎర్రబారినయ్. రైతులంతా కలిసిరికూడ పిలుచుకోడానికి బ్రతుకు తెరవు ఆలోచించుకోడానికి మర్రిక్రింద సభ జరిపారు.

"జమీందారు జలగలాగ మన రక్త మాంసాలు పీలుస్తున్నాడు. మనతాతలు దున్నినభూమి మన తండ్రులకు దక్క లేదు. మన తండ్రులు తమ చమటోడ్చిన భూమి మనకు దూరమయింది. మనసత్తు వతో పగలదున్నిన ఈ భూమి రేపు జమిందారు వశమౌతుంది. అసలుదున్నేది పండించేది మనంగదా? మనశక్తి మన విలువ మనకు తెలియకుండా చదువు సంధ్యలేని అమాయకుల్ని చేసి మన కష్టాన్ని దోచుకుంటున్నారు. మనభూమి మనకు దక్కాలంటే జమిందారును యెదిరించక పోతే లాభంలేదు. పైగా ఈజమిందారీ పద్ధతినిరద్దుచేయడంలో మనమంత్రులు నా నాటికిజమిందారులకేలొంగిపోతున్నారు. మనం మన కాళ్లమీద నిలబడి మంత్రివర్గ పోలీసు సహాయాల్ని ఖండించుతూ మన భూమికోసం పోరాడాలి. ఏకమై నిల బడితే మనం జయించితీరుతాం. దున్నే వాడిదేభూమి మనందున్నాం. కష్టించాం. చమటోడ్చాం,యీ భూమంతా మనదే..." "మోహన్ చెప్పిన ఈమాటలు విన్నారు. వారి మనసుల్లోదే,వారు చెప్పలేనిది అతను గట్టిగా నొక్కి చెప్తున్నాడనిపించింది. సరేనంటే సరే ననుకున్నారు. వెంటనే కాపాడుకోకపోతే జమిందారే లాక్కుని వేలంవేస్తాడని గ్రహించారు.

* * *

ఇవ్వాళ తమ తమ భూముల్ని దున్ను కుంటానికి రైతులు బయలు దేరారు. "మనదేభూమి" "దున్నేవాడిదే భూమి" జమిందారీ విధానం నశించాలి!" అనే నినాదాలు మిన్ను ముట్టాయి. మోహన్ అందరికంటె ముందున్నాడు.

తాతకు భూమంతా తిరిగిపోయినట్లని పించింది. కాళ్లు చేతులు వణక సాగాయి

నెమ్మదిగా మోహన్ దగ్గరకువచ్చాడు న్యాయం, పుత్రప్రేమ అతనిలో సంఘర్షించుకుంటున్నాయి. ఎన్నో చెప్పాడు. అనలేక అనలేక చివరకు "సరేనీయిష్టం" అన్నాడు. ముడుతలు పడిన రామయ్య తాత బుగ్గలమీద కన్నీరు ప్రవాహం కట్టింది. రామయ్యతాత అశ్రుపూరిత నేత్రాలు అతన్నేదో అడుగుతున్నాయి. దుఃఖంతో నిండిన వృద్ధగొంతునుండి ఏవో మాటలు వినిపించాయి. "నాయనా రెక్కలు సల్లగా వుంటే ఎట్టయినా బ్రతకొచ్చు. బ్రతికుంటే బలుసాకు తింటాం. తలకు మించిన పనులు దేనికిరా?" అందరితో పాటు మోహన్ ముందుకు నడిచాడు.

వచ్చే దుఃఖాన్నాపుకుంటూ నడుం విరిగిపోయిన వాడిలాగ కూలబడ్డాడు తాత.

అవి పొలాలు బోర్డులు ... **144**... న్యాయంకోసం...ప్రభుత్వం ఉత్తరువులు.

మీరు పోలీసులి ఉత్తరువులను ప్రత్యక్షంగా అమలు పరుచుటకు తయారైన తుపాకులు.

"మనదే భూమి!" కేకలువేస్తూ ముందుకుసాగారు రైతులు.

"పోలీసులు తుపాకులు గాలి లోకి పేల్చారు.

"దున్నేవాడికే భూమి!"

తుపాకులు గురిపెట్టారు.

రైతులు ముందుకు సాగారు. వారి రక్తం వేడెక్కింది. కళ్లు నిప్పులు కురుస్తున్నాయి. ఢాం ... ఢాం ... ఢాం ... డొక్కలో...ఎదుర్రొమ్ములో ...గుండు ...రక్తం...తమ భూమికోసం, తాము

[ 12 వ పేజీ తరువాయి ]

వాన్నే కలుషితం చేస్తోంది. వీడిక్కింద లాలా లజపతిరాయ్ నెత్తురుకక్కుకుంటూ లాహోరు వీధుల్లో చనిపోయాడు. పండిత నెహ్రూతల్లి అలహాబాదులో వీడి దెబ్బకు రక్తమోడ్చింది...."

వెంటనే లాఠీలన్నీ ఒక్కసారి. "కమ్యూనిస్టు! కమ్యూనిస్టు! పట్టుకోండి! పట్టుకోండి!" అని కేకలువేసినై, ప్రజలు ఒక్కసారిగా లేచి కంగారుగా బెదిరిపోతున్నారు. తుపాకులు నోళ్లు తెరిచి గుండ్లు పేల్చుతున్నాయి. టియర్ గ్యాస్ దట్టంగా క్రమక్రమంగా పెండాలంతా ఆవరించింది.

లాఠీలు ఆ వ్యక్తికోసం మీటింగంతా దువ్వేశారు కాని, ప్రజలు అంతసేపు ఉపన్యాసం వినిగూడా, పట్టుకోమంటే అతన్ని పట్టి ఇవ్వనందుకు ఆగ్రహావేశాలతో లాఠీలన్నీ ప్రజలపైబడి వినయవిధేయతలు నేర్పుతున్నాయి.

కాని, నాయకుడు లాఠీరావు మాత్రం "ప్రజలెప్పుడూ కృతఘ్నులే"నని వాపోతూ వేదికపైనే మూర్ఛపోయాడు.

---

## ఎడ్గర్ మారిన్ :

ఈ విద్యావిధానం ఎలాంటిదంటే, సంస్కృతి అలవరచుకోవడం మనం స్కూలు బైటికి వచ్చిన తర్వాతగాని ప్రారంభించలేం.

---

పుట్టి పెరిగి సేవచేసిన పొలంకోసం కదలిన రైతులు నేరస్తులు!!

తమ భూముల కోసం మరణిస్తున్నారు. అందుకు రైతులు గర్విస్తున్నారు. అభిమానంతో వారిశక్తి ఉప్పొంగుతోంది. వారు ముందుకుసాగారు ...ముందుకు సాగడమే వారి లక్ష్యంలాగా, మహా ప్రళయంలా సాగాయి. వారిదే విజయమని వారికి పూర్తిగా తెలిసినట్లు ఈ విధంగా తరతరాలు చచ్చేదానికంటే ఒకసారే చద్దాం అనే దీక్ష వారిని ముందుకు త్రోస్తున్నట్లు కదిలారు.

మోహన్!...రక్తంతో తడిసిన చొక్కా క్రిందుగా డొక్కదగ్గర చేయి వేసి అదుముకుంటున్నాడు. సో...దరు...లా...రా! మన...దే.. భూ...మి! ఆ తర్వాత మోహన్ కంఠం పలకలేదు.

అతని చేతిలో జండా ప్రక్క రైతు అందుకున్నాడు. మోహన్ నేలకొరిగినా మోహన్ జండా ఎగురుతున్నది మోహన్ ఆశయాన్ని సాధించమని ఘోషిస్తుంది. అతను అమరజీవి తన జెండా రెపరెపలాడుతూ వుండడం మోహన్ చివరి క్షణాల్లోకూడ చూశాడు రైతులంతా చుట్టూచేరారు. 'మా సర్వస్వం ఒడ్డి నీ ఆశయాన్ని సాధిస్తా' మని శపథం చేశారు. 'మా ప్రతిరక్తపుచుక్క నీజండాకోసం, నీ కాంక్ష కోసం బలిచేస్తాం. విజయం పొందిన నాడు నీ స్మృతిని గౌరవిస్తాం. పతాకోత్సవం చేస్తాం'.

సాయంకాలానికి చాలమందిని అరెస్టుచేశారు. వారిలో రామయ్య తాతకూడ ఉన్నాడు. ఇటు పోలీసులారీలో తాత, అటు మోహన్ శవం రెండూ ఒకేసారి కదిలాయి గ్రామమంతా మోహన్ చుట్టూ చేరి విలపిస్తున్నారు. "మోహన్ ఆశయాన్ని సాధిస్తాం!" "మనదేభూమి!" అనే నినాదాలు వింటూ తాతకళ్లు మెరిశాయి. మోహన్ మరణంతర్వాత గ్రామంలో పిల్లా పెద్ద అంతా కదిలారు. తాత హృదయం గర్వంతో వుప్పొంగిపోయింది. తాత రక్తం వుడుకెత్తిపోయింది. తాత ముసలి మీసాలునిక్కపొడిచాయి. "మనదేభూమి" "మోహన్ ఆశయాన్ని సాధిస్తాం!" తాత పిచ్చివాడిలాగ అరిచాడు. ప్రక్కనున్న కర్కశమైన పోలీసులాఠీ తాత పైకురికింది.

కాని ఈ కేక కోట్లకొలది రైతులగుండెల్లో మోగుతోందని, ఈ ఆశయం సాధిస్తారని తాతకు ఇప్పుడు తెలుసు. ఇదే న్యాయం, పీడితలోకంలో పోరాటశక్తి ఒక్కటే మానవుని విలువకు నిదర్శనం తాతకు ఆఖరుసారి అర్థమయిందంతా.

తాతకు పుత్రశోకం కలగలేదు. ఇందరు పుత్రులు, పుత్రికలు మోహన్ గుండె మోతగా అరుస్తున్నప్పుడు శోకమా! చుట్టూ తుపాకులు గురిపెట్టి పోలీసులు పహారా ఇస్తూన్నా, తాత సగర్వంగా జండాపట్టుకుని ముందుకు నడుస్తున్నాడు.



## స్కెచ్

# స్వప్నపు నీడ క్రీనీడ!

### "మాన్స"

నేల జీవితాన్ని అరవై రెండు రూపాయిల ఎనిమిదణాల కొలత బద్దతో కొలుస్తూ రోడ్డువెంట నడుస్తున్నా. నా నీడ క్రీనీడ అద్దాల కిటికీలోంచి లోపల గదిలో పడి వంకరటింకరగా నడుస్తోంది. దాని నీడ! అరవై రెండున్నర రూపాయిలు అయిపోయిన ఖాళీ పర్సు నీడ! నీడ...!

నిప్పుకోసం చుట్టూ వెతుకుతున్నాయి కళ్లు; ఎవడా 'గుర్రండెక్క' జేబులో కలవాడని... సీమదేశాల్లో గుర్రండెక్క అదృష్టానికి గుర్తు...!

గడిచిపోయిన తియ్యని దినాల్లో (గడిచిపోయిన దినాలెప్పుడూ తియ్యగానే వుంటాయి. మరో సంవత్సరంపోతే ఈవేళ తియ్యగానే వుండివుంటుంది. సంవత్సరం క్రితం తిన్న వేముచేదు సంవత్సరం తరువాత నాలుకకు తియ్యతియ్యగా తగులుతుంది.) కోటుమినహా మిగిలిన సైకిలు వేలం వేశాను.. అయిదు సంవత్సరాలు తొక్కిన సైకిలు... స్కూలు ఫైనల్ పరీక్షహాలుకి తీసుకెళ్ళిన సైకిలు! ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో పరీక్షఫలితాలు తీసుకొచ్చిన సైకిలు... అయిదురోజుల్లో ఆరు గుండ్రటి అన్నపుముద్దల్లో అయిపోయింది! చక్రాలూ... సీటూ అన్నీ...!

అదే ఆలోచిస్తున్నాను.... సైకిల్లు మింగగలిగేవాడికి పచ్చగడ్డి భోజనం కాకుండా ఎలాపోయిందీ అని....

అసలు ఈ ఆలోచన లేమీ పనికిరావు... దీన్లో చాలా నష్టాలున్నాయి. మెదడుని ఎక్కువ శ్రమపెడితే ఆకలి ఎక్కువవుతుంది. ఆకలి అయితే నీళ్ళు సరిపోవు. కోటుకూడా వేలంవేస్తే ...?

అదే ఆలోచించాలి... అరవై రెండున్నర రూపాయిలు రావాలంటే ఎన్ని కోట్లు వేలం వేయాలి...?

నీవూ నేనూ ఎవరూ కాని ఎవడికీ తెలీని మనిషి మరొకడు రోడ్డు వెంట నడుస్తున్నాడు వాడి నీడ నామీదొంగి పాకిపోయింది. ఇంటి దగ్గిర పెళ్లాంవుందా వీడికి...?

పెళ్లాలు పెళ్లి చేసుకోడ మెందుకు మనల్ని? మళ్లీ విడిచి పెట్టడ మెందుకో! నాకేం! బాధపడే దాకా చీర కొనకపోతే... అసలు నా పెళ్లాం కన్నీళ్లు ఎందుకు పెట్టింది? ఎందుకో! ?

ఈ మధ్య ముకుందరావూ, గోవిందప్పా అంతా సమ్మె చేశారు.

"అంటే ఏమిటి?" అని అడిగాను.

"మనకి జీతం సరిపోవటంలేదు" అన్నారు. ఒక్కసారి ఇరవై వేల గుమస్తాల గొంతుకలు నా చెవిలో వినిపించాయి.

"మన పెళ్లాం పిల్లలు బతకడం కోసం" నీరసంగా అంది అయిదు రోజుల క్రితం భోంచేసిన పద్దెనిమిది వేల ఆరువందల నలభై తొమ్మిదో గొంతుక...

"పెళ్లాలు ఏడవకుండా చీరలు కొనిపెట్టడంకోసం.. ఉత్తుత్త కబుర్లు చెప్పి అన్నం వండించుకోవడం కోసం ... పిల్లలకు జబ్బొస్తే మందులు కొనడంకోసం... నేను గెడ్డం గీసుకోనేందుకు ... కోటు మాసిక వేసిన టైలర్ తమ్ముడికి బేడ అప్పుతీర్చేందుకు..."

"మనం బాయబారాలు నడిపాం..."

"ఒప్పుకోరు... ఒప్పుకోరు.... నాకు తెలుసు..."

"విను పూర్తిగా ... మన సంఘం సమ్మె పిలుపిచ్చింది... మనమంతా ఆఫీసులు మానాలి."

నడచిన రోడ్డు మళ్ళీ నడిచాను ఎంతనడిచినా పూళ్ళో మరొకొత్త రోడ్డు కనుక్కోలేకపోతున్నాను.

ఇదుగో! ఇంకో విషయం కని పెట్టాను. ఎవరేనా ఎవర్నయినా నీ జీతం ఎంత అంటే అరవై రెండున్నర అంటారు. అది ఎన్నాళ్ళకి? నెలకి ... అంటే నెల మూడో తారీఖున! నాలుగో తారీఖున ఎంత? మూడో తారీఖున ఖర్చు పెట్టగా మిగిలింది... మూడో తారీఖున నేను ఇరవై రూపాయలు

ఖర్చు పెట్టాను. నాలుగున నా జీ(వి)త మెంత? నలభై రెండున్నర. పదహారున జీతమెంత? నోరావలించి కళ్ళను పీకేలా కోరలు చాచే ఖాళీ పర్సు ...

జీ(వి)తాన్ని మార్చాలంటే జీ(వి)తాన్ని పోత పోస్తున్న వాళ్ళు మారాలి... ఏదో చెన్న పట్టణంలో పద్దెనిమిదో ఫర్లాంగు ఎత్తు అంత స్థూమీద సిరాబుడ్డి మూతులో ఆకాశమంతటి తెల్లటి కాగితాల మీద "వెంకట్రావు జీ(వి)తపు కొలబద్ద అరవై రెండున్నర" అని రాసే తనకు తెలీని ఆ అతీత వ్యక్తిని ఎవరు కనుక్కోగలరు?

బ్రహ్మరాక్షసి...ప్రాణం పంజరంలో రామచిలుక...ఆరు సముద్రాలు దాటాలి ... అరటి తోటలో మర్రిచెట్టు ... దాని బోదెలో పంజరం ...దాంట్లో వుంది చిలక... గిలగిలలాడితే రాక్షసి గిజగిజ లాడుతాడు... చిలక చస్తే రాక్షసి చస్తాడు... చిలకని గిజగిజ లాడించాలంటే?

చిత్రమైన ఊహలు కదూ? బజారు "నడుస్తోంది" ఆక

(తరువాయి 70 వ పేజీలో)

# సంపాదక వర్గం

## కార్యదర్శుల ప్రకటన

★

'అభ్యుదయ' కార్యాలయంలో పనిచేయడానికి, కార్యవర్గ సభ్యులలో ఒకరైన శ్రీ అనిసెట్టి సుబ్బారావుగారిని జనవరిలో పిలిపించాము. అప్పటినుంచీ ఆయన కార్యాలయంలోనే వుండి, పత్రికకూ సంఘానికీ సంబంధించిన అన్ని విషయాల్లోనూ మాకు పూర్తిగా తోడ్పడుతున్నారు.

పత్రికను ఇంకా సజీవంగానూ, ఇంకా ఆకర్షణీయంగానూ తయారు చెయ్యడానికి ప్రస్తుతం వున్న సంపాదకుల కృషి మాత్రమే చాలడం లేదు. అందువల్ల, శ్రీ అనిసెట్టి సుబ్బారావుగారిని సంపాదకవర్గంలోకి తీసుకుంటున్నాము.

కొమ్మరాజు వినాయకరావు
ప్రయాగ కోదండరామశాస్త్రి
కార్యదర్శులు:
ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం.

* వచ్చే సంచికలో *

ప్రఖ్యాత జెక్ రచయిత జూలియస్ ఫ్యూజిక్ ఖైదులో రహస్యంగా వ్రాసి బైటికి పంపిన ప్రసిద్ధ గ్రంథం "Notes from the GaoIlws" వచ్చే సంచికనుంచీ సీరియల్ గా ప్రకటించబడుతుంది.

17. వ పేజి తరువాయి

★ ప్రసిద్ధ భారతీయ రచయితలు డాక్టరు ముల్క్ రాజ్ ఆనంద్, క్వాజా అహ్మద్ అబ్బాస్‌లు రష్యా వెళ్ళటానికి బొంబాయి ప్రభుత్వం అనుమతి నిరాకరించింది.

★ షేక్ అబ్దుల్లా సంయుక్తరాజ్యసమితి సమావేశంలో కాశ్మీర్ సమస్యనుగూర్చి సింహగర్జనచేసి తిరిగి వచ్చిన వెంటనే ఢిల్లీ రేడియో అధికారులు ఉపన్యాసం చెయ్యమని ఆహ్వానించి, పైగా, ఉపన్యాసం ప్రూఫ్టినీకోసం ముందే పంపాలని నిబంధిస్తే, షేక్ అబ్దుల్లా ఆగ్రహించి, ఆహ్వానాన్ని నిరాకరించి కాశ్మీర్ వెళ్ళి తన స్వంతరేడియోలో స్వేచ్ఛగా మాట్లాడాడు.

* బెర్నార్డ్ షా :

డాక్టరు

మహాశయా! వద్దనుకున్నా ఇక మీకు చెప్పకతప్పటం లేదు. మీరొక స్కాండ్రెల్ అని నానిశ్చితాభిప్రాయం.

ఆర్టిస్టు

ఏమిటి! హు, అర్థం లేదు. నేనుస్కాండ్రెల్‌నుకాను బెర్నార్డ్ షాశిష్యుణ్ణి.

[ 18 వ పేజి తరువాయి ]

"పర్మిట్" అని వ్రాసి వుంటే సంతోషంతో పెద్దగా "పర్మిట్, పర్మిట్" అని కేకలువేస్తూ వెళ్ళాడు.

నాలుగో వ్యక్తి కూలీలాగున్నాడు. మెల్లగా, నిస్సత్తువగా, వచ్చి జేబులోవున్న ఒకేబేడా బిళ్ళతీసి నిమ్మళంగా అందులో విడిచాడు. సాదాబట్టలపెద్దమనుష్యులు తొంగి చూస్తున్నారు. టక్కున ఒక టికెట్ బెటపడింది. అతను ఆతురతగా తీసి చూస్తే "వారంట్!" అని వుంది. వెంటనే సాదా బట్టల మనుష్యులు "కమ్యూనిస్ట్! కమ్యూనిస్ట్!" అని కేకలు వేస్తూ కూలీ రెండు రెక్కలూ పట్టుకునినడిపించుకు పోయారు. జనం నిర్ఘాంతం పోతున్నారుకాని, యంత్రంఎందుకు కనిపెట్టారో పాపంవాళ్ళకేం తెల్సు?

* గోర్కీ :

కంట్రాక్టరు

ఒకసోదరుడునిర్మిస్తాడు. మరొక సోదరుడు ధ్వంసం చేస్తాడు. నేను, కంట్రాక్టరునుగనుక రెండువిధాలా లాభం తీస్తాను.

## ★ గ్రంథ సమీక్ష ★



### * పేదరాలు
### * విలాసిని
**అనువాదం : విద్వాన్ విశ్వం**

నవ్యసాహిత్యమాల (అనంతపురం) ప్రచురణలు. ప్రతి ఒక్కొక్కటి పన్నెండణాలు.

పిరాండెల్లో, మోరెట్టి ప్రఖ్యాత ఇటలీ కథకులు. పిరాండెల్లో వ్రాసిన 'పేదరాలు', మోరెట్టి కథ 'నెరజాణ'. గోర్కీ 'ఒకసాయంకాలం' అన్న కథను కూర్చితే 'పేదరాలు' కథాసంపుటి.

కడుపుకక్కుర్తి కోసం ఒకామె చిన్న పిల్లణ్ణీ, ముసలి అత్తనీ, భర్తనీ వొదిలేసి కలవారియింట పాలదాది ఔతుంది. తుదకు తన పిల్లడు చచ్చిపోతాడు. భర్తనికోల్పోతుంది. తన శీలాన్ని కూడా కోల్పోయి ఈ అసమాన సమాజ యంత్రానికి బలిఅవుతుంది.

'మేరీ' అనే ఆమె తన తప్పుడు పనుల్ని మాటల్లో కప్పేసి భర్తని వంచించి, తను ఆత్మవంచన చేసుకోడం 'నెరజాణ' కథలో ఇతివృత్తం.

'విలాసిని' ప్రపంచ ప్రసిద్ధ రచయిత 'చెకోవ్' కథలసంపుటి.

'విలాసిని' ఐన 'ఓల్గా' విలాస ప్రియత్వంతో, ఉదారుడైన భర్తని వొదిలి, తర్వాత 'రిబవస్కీ' అన్న ప్రియుడితో కూడా జీవితం ఇమడక, భర్తనీ, జీవితాన్నీ కోల్పోతుంది.

'బాధ' అనే కథలో కర్రపని చేసుకునే 'గ్రెగరీపెట్రోఫ్' అనే బీదరైతు తన భార్య అంత్యఘడియల్లో తన విషాదజీవితాన్ని తలుచుకుంటో, భార్యతో పాటే పరమపదిస్తాడు.

బాధలతో ఆశలతో జీవించే 'యాకూబ్' భగ్నహృదయ విలాపమే 'అన్నీ నష్టాలే' అన్న కథ.

'పేదరాలు'లో చేర్చిన 'ఒకసాయంకాలం' అన్న కథ ఇదివరకే పాఠకలోకానికి సుపరిచితమైనది. ఇది ఇప్పుడీ సంపుటిలో ఎలా అవసరమైందో! ప్రచురణకు ముందు మరోసారి అనువాదాన్ని సరిచూసుకుంటే చక్కగావుండేది.

— 'విప్లవాత్మ'

(67వ పేజీ తరువాయి)
లయ్యేప్పుడు మిఠాయి దుకాణా లెక్కువ కనిపిస్తాయి.

రోడ్లు తుడిచేవాళ్లు పాటలు కూడా పాడతాగుకదా ... అది సంతోషమా? లేకపోతే Desperation? వాళ్లు సమ్మెలు చేస్తారు. లాఠీ దెబ్బలు తింటారు, జైళ్లకు పోతారు...ఎందుకు? వాళ్ళు అడిగేది ముప్పైమూడు రూపాయిలు ఇమ్మని ... నాకు సరిపోని అరవై రెండున్నర ఇస్తే వాళ్ళు ముప్పైమూడే అడిగినా ఇవ్వరేం?

కాలవ వంతెనమీాద నుంచి అనేకమందిఇటునుంచిఅటూ, అటు నుంచి ఇటూ నడిచిపోతున్నారు.

"కానీ!"

"ఒఖ్ఖకానీ!"

"గుడ్డివాడికోపైసా!"

కళ్లున్నవాళ్ళు కళ్ళు నెత్తి మీాద అతుక్కొని, పక్షులూ... మేఘాలూ ... చెట్ల చిటారు రొంబ్బలూ వీక్షిస్తున్నారు; పర్సులు జాగ్రత్తగా మాత్రం కోటులోపల జేబులో దాచుకొని ... రిక్షాలు లాగించుకొంటున్నారు ... కారు చక్రాలు గబగబ తిప్పుతున్నారు. ఔను కాని, డబ్బున్నవాళ్లు పర్సు ఎప్పుడూ లోపల జేబులోనే దాచుకుంటారేం?

కొండమీాద అద్దాలమేడమీాద నా నీడపడి...అద్దాలమేడని పిడికిలితో కౌగిలించి... వేలకు వేల మైళ్ళు ఎత్తుపెరిగి...నా జుట్టంతా ప్రతి కేశమూ మానవుడుగామారి లేచి... లేచి....శ్రమజీవులచెమటని రక్తపు బొట్లుగా ... ప్రవహించే లావాద్రవంగా...కళ్ళల్లోంచి పగిలిన అగ్ని పర్వతాల నిప్పుల రాళ్లై పళ్ళు పటపట కొరికి...ఏటంబాంబులై...పిడుగులై... నేనే! నోటిలోంచి కారే రక్తపుచారే ... ప్రవహించిన మనీపర్సుల రక్త సముద్రమై... వెలువడిన చిరునవ్వే పద్మమై...లక్షలలక్షల, కోట్లకోట్ల శ్రామికుల కళ్ళల్లో మెరుపు స్వర్గమార్గమై ... అప్పుడే పుట్టిన పసిపాప చిరునవ్వాయి... పసిపాప అమాయిక చిరునవ్వాయి...!నేనే! నేనే!! అంతా...

# లేఖలు

## 'ఆంధ్రవనిత'

విజయవాడ, జులై. 24

మహాశయా,

'ఆంధ్రవనిత' సంపాదకురాలైన డాక్టర్ అచ్చమాంబగారిని ది 20-6-48 వ తేదీన ప్రభుత్వం అరెస్టుచేసి డిటైన్ చేసింది. మే నెలలో రద్దయిన ప్రెస్ డిక్లరేషను తిరిగి యింతవరకు యివ్వలేదు. ప్రెస్ డిక్లరేషను యిచ్చుటకు కొంత రిఫరెన్సు కావలసి వచ్చిందని పోలీసుస్టేషనుకు రమ్మని కబురు చేస్తే వెళ్ళగా అరెస్టుచేశారు. స్త్రీలపత్రికను యీవిధంగా అణచివేసి ప్రభుత్వం స్త్రీలకు చాల అపచారంచేసింది. డిక్లరేషను రాక పోవుటవలన, సంపాదకురాలిని అరెస్టు చేయుటవలన 'ఆంధ్రవనిత' యిప్పట్లో వెలువడదు. ప్రభుత్వంయొక్క యీ నిరంకుశ చర్యలను పాఠకులంతా ఖండించి ప్రభుత్వానికి నిరసన తెలుపవలసిందిగా కోరుచున్నాం.

వెల్లంకి అన్నపూర్ణాదేవి
మేనేజరు.

## "అభ్యుదయ"

## తెలంగాణా సంచిక

ఆర్యా,

అభ్యుదయ తెలంగాణా సంచిక సంఘ జీవితములోని పాటు పోట్లను సాహిత్యము ఏవిధంగా అంతర్భుక్తం చేసుకోగలుగుతుందో చూపెట్టడానికి చక్కని నిదర్శనం. సంపాదకులు ఈ కర్తవ్యాన్ని నిర్వహించడములో చాల చక్కని కృషి చేశారు. కాని రచయితలు వ్యక్తిగతంగా తమ విధిని నిర్వహించడములో ఎంతవరకు సఫలురయ్యారనేది ఆలోచించడం అవసరం. 'నవజాగృతిలో' తెలంగాణా ప్రజలు ప్రజాపోరాటాన్ని ఎన్ని అపూర్వత్యాగాలకు లోనై నడుపుతున్నారో నిరూపించబడినది. కాని కథ స్పష్టంగా, సహజంగా శక్తివంతంగా లేదు.

'విముక్తి' గూడ అదే ధోరణిలో ఉంది సుబ్బమ్మ మనోవేదన, చింత, దుఃఖము, పాఠకుల మనస్సుకు నాటుకునేటట్టుగా లేదు. సుబ్బమ్మ మనోవేదనను మరింత సాంద్రంగా చిత్రిస్తే ప్రజాద్రోహి శిక్ష, పాఠకులకు మరింత రిలీఫును యిచ్చేది. 'నీకాలు మొక్కుతా, నీ బాంచెను', అనేది కథగా కనబడదు. దీనిలో రంగారావు పాత్రద్వారా తెలంగాణా ప్రజలుఅవివేకులని, మూర్ఖులని నిరూపించబడలేదా? ఈ తీర్మానాన్ని రచయితకు సంబంధించిందో, లేక పాత్రకు సంబంధించిందో నిర్ణయించుకునేపని పాఠకులకే వదులుతున్నాను. కథ పూర్తి కాకముందే తెలంగాణావాసులు యెంత అనాగరికులో! అనేభావం మాత్రం పాఠకుల్లోఏర్పడుతుంది 'పాగల్ యల్లమంద' కథ అయోమయంగావుంది బోయన్న యల్లమందని చెప్పుకోగా 'పాగల్' అని విడిచిపెడతారు ఊరి పటేలతని సమక్షంలోనే వుంటాడు. పటేల్ ఎలా నమ్మాడో తెలియదు. పైగా తరవాత దళనాయకుడుగూడా

బోయిన్నను ఎల్లమంద అనే సంబోధి స్తున్నాడు. 'వీరనారి' లో కథ లేదు. కథ అంతా నిమిషంలో స్టేజిపైన జరిగిపోతుంది. రచన రంగాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాయబడ్డట్టు ఉన్నది కాని, కథను గొప్పగా నడిపించాలనే ఆతురత కనిపించలేదు. 'నీవుచెప్ప ! His Exalted...' అనే దీర్ఘ ప్రయోగాలు ఏవగింపు కలిగించవచ్చు. 'శాంతి రక్షణ కోసం' అనే నాటికలో తెలంగాణా పోరాటంగూర్చి సంఘపు పెద్దల్లో ఏలాంటి అభిప్రాయాలు ఉన్నాయో చూపించడానికి ప్రయత్నం చేయబడినది. యవనిక వెనక కొంత, యవనిక ముందు కొంత సంభాషణలు జరగడంవలన మొదట కొంత తికమక అవుతుంది. దీనిని దిద్దిపెట్టుకోనిదే, రచయిత అభిప్రాయం స్పష్టపడదు. 'కాంగ్రెజా ఆంగ్రేజా' అనే నాటికలో కాంగ్రెసులో జరుగుతున్న విషాన్ని విడదీసి చూపడానికి ప్రయత్నము చేయబడినది. సంభాషణలు చాలవరకు చక్కగా నడిచినవి. రైతు పాత్రలు యింకా స్పష్టపడితే నాటిక మరీ రక్తికట్టేది. 'పగ' లో సంభాషణలు, భాష, సహజంగా ఉన్నాయను కుంటాను. కాని పాత్ర వైవిధ్యము ఇంకా స్పష్టపడటం అవసరం. 'సంగినేని' గేయం ఉత్సాహకరంగా ఉంది. సోమసుందర్ గేయంలో 'ఇంటికొక మానవుడు వీరుడై పొంగాడు' అనేది బాగా ఉంది. శివయ్య గీతం గుండెలకు తాకడంలేదు. అనిసెట్టి 'సమరసాహిత్యం' సమీక్ష యింకా తీరిక చేసుకొని రాస్తే బాగుండేదేమో. అనుకరణలైనా వ్యంగ్య చిత్రాలు పత్రికకు వన్నె తెస్తున్నాయి. కాని సహజ చిత్రాలు రావడం అవసరం. సామూహికంగా సంచిక చాలా బాగా ఉంది.

పొట్లపల్లి రామారావు
బొమ్మలూరు.



## అభినందనాలు

మీరు ప్రచురించిన 'అభ్యుదయ' తెలంగాణా సంచికను చూశాను. తెలంగాణాలో కుములుతున్న మన సోదరాంధ్రులకు ఇంత సేవచేసిన పత్రిక మరొకటిలేదు. మీ పత్రిక మన తెలుగుదేశానికి గొప్ప జాతీయ సాంప్రదాయమును సృష్టిస్తున్నదని, అన్ని పత్రికలు మిమ్మల్ని అనుసరించినచో మన దేశము త్వరలోనే విజ్ఞానవంతమగునని అనుకొనుచున్నాను.

నా అభినందనములు తెలియజేయుటకు ఈ పత్త్రరం వ్రాయుచున్నాను. కార్డు వ్రాసినందుకు క్షమింతురుగాక.

యస్. భగీరథరావు,
బొంబాయి.

[తెలంగాణా సంచికనుగురించి మాకు అనేక లేఖలు వచ్చాయి. వారి అభివందనాలకు మా కృతజ్ఞత. –సం.]

Editor, Printer & Publisher : K. Vinayaka Rao
Secretary, Andhra Progressive Writers' Association, Governorpet.
Printed at Abhyudaya Press, Vijayawada.

# మావద్ద దొరికే పుస్తకాలు



1. మహాకవి గురజాడ అప్పారావుగారి
   'ముత్యాల సరాలు' 1—0—0
2. కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి
   'స్వీయ చరిత్ర' 2—0—0
3. పి. వి. రాజమన్నారుగారి
   'ఏమి మగవాళ్ళు!' 0—12—0
4. తెన్నేటి సూరిగారి
   'సుబ్బులక్ష్మి కథలు' 0—12—0
5. నార్ల చిరంజీవిగారి
   'తెలుగు పూలు' (బొమ్మలతో సహా) 0—6—0
   ,, బొమ్మలు లేని ప్రతి 0—3—0
6. 'తెలుగు తల్లి' సంచికలు —
7. 'అభ్యుదయ' సంచికలు —

వివరాలకు:

మేనేజరు, అభ్యుదయ, విజయవాడ

---

# వెలువడ్డాయి!

## ★ అభ్యుదయ ప్రచురణలు ★

శ్రీ ఉప్పల లక్ష్మణరావుగారి

ఉత్తమ నవల

## అతడు - ఆమె

200 పేజీలు; వెల: రెండు రూపాయలు

ఉత్తమ కథలసంపుటి

## అభ్యుదయ కథలు

పదికథలు — 84 పేజీలు — ముప్పావులా

Wrapper Printed at P. N. Moorty Press.